Photo by P. R. Shinde



బహుమతి
పొందిన వ్యాఖ్య

జంట విడిచి ఉండము

పంపినవారు :
రమేష్ - అంబం

# ఒక బహుమతిని గెలవండి.

## తప్పులను గుర్తించండి!

### తప్పులు ఎక్కడున్నవి?

గోవింద్, అచ్చుపని నేర్చుకుంటున్న బాలుడు, అధిక చిక్కుపాలయ్యాడు. అతడు అతి తొందరగా కొన్ని బినాకా చిత్రాలను ముద్రించుటకు ఆజ్ఞాపించబడ్డాడు. కాని పని పూర్తవగానే, మేనేజరు చాలా ఆగ్రహపడ్డాడు. గోవింద్, అనేక తప్పులుచేశాడు. అతని తప్పులను గుర్తించుటకు మీరు గోవింద్‌కు సాయపడతారా? గోవింద్ యొక్క పని నమూనాలో ప్రతి తప్పుచుట్టూ సున్నా గీయండి, ఉదాహరణగా ఇలాంటివి:

'TOTHPASTE' 'GRE(A)N'



ఎంట్రీ కూపన్‌లో మీరు గుర్తించిన తప్పుల సంఖ్యనుకూడా సూచించండి. రంగునుగాని లేక చిత్రాన్నిగాని మీరు దిద్దనక్కర్లేదు.

మొదటి బహుమతి: రిస్టువాచి - ఒమేగా, కన్‌స్టిల్లేషన్, అఫిషియల్లి సర్టిఫైడ్. సెల్ఫ్‌వైండింగ్ క్రానామిటర్, ఆల్‌ప్రూఫ్. (ఖరీదు రు. 690/-)

రెండవ బహుమతి: రిస్టువాచి - ఒమేగా, సీమాస్టర్ క్యాలెండర్, ఆల్‌ప్రూఫ్, సెల్ఫ్‌వైండింగ్, ఏకకాలమందే తారీకును, కాలమును తెలుపును. (రు. 500/-)

మూడవ బహుమతి: రిస్టువాచి - ఒమేగా, సీమాస్టర్, సూపర్ వాటర్ టైట్. సెల్ఫ్‌వైండింగ్ వాచి, దాని ఖచితానికి 30,000 కన్నా ఎక్కువమంది విమాన పైలట్లచే ఎన్నుకోబడ్డది. (రు. 450/-)

తదుపరి 12 బహుమతులు: అగ్‌ఫాక్లేక్ కెమేరాలు. (రు. 29/- ఒక్కొక్కటి)

తదుపరి 12 బహుమతులు: బేడ్మింటన్ రేకెట్లు, హాకీ స్టిక్‌లు 1 కి (రు. 10/-)

తదుపరి 12 బహుమతులు: పెయింట్ బాక్సులు, (కుంచెలుసహా) (రు. 7-8/- ఒక్కొక్కటి)

తదుపరి 500 బహుమతులు: "పాలీటైనర్" ప్రయాణపు నీటి సీసాలు, (రు. 5/ ఒక్కొక్కటి)

తదుపరి 5000 బహుమతులు: "ది ట్రెజర్ హంట్" ఒక క్రొత్త ఇంటిలోని ఆట, మరియు, పోటీదారులందరికీ; క్రొత్త (1955) బినాకా, స్కూల్ టైంటేబిల్.



# ఉచిత బినాకా టూత్ పేస్టు పోటీ;

## 14 సంవత్సరాల వయసును మించని పిల్లలకు;

## ఎవరు గెలిచెదరు!

గోవింద్‌యొక్క తప్పులన్నిటినీ ఒక్కొక్కదానిచుట్టూ సున్నా గీయుటవల్ల దిద్దినట్టిన్నీ మరియు ఎంట్రీ కూపన్‌లో తప్పుల సంఖ్యనుకూడా సరిగా సూచించినట్టి పోటీదారు, గెలుపుదారు. ఎలాగైనా, ఒకరికన్నా ఎక్కువమంది గెలుపుదారులుంటే, ఉత్తమ ఊతగీతాలను పంపిన గెలుపుదార్లకు, శ్రేష్టతను బట్టి, బహుమతులు ఇవ్వబడును.

ప్రతి ఎంట్రీతోనూ ఒక్క గీతంమాత్రమే అంగీకరించబడును. గీతం (లేక వాక్యం)లో దంతశ్రద్ధ యొక్క ప్రాముఖ్యతనుగూర్చి 12 మాటలు మించకుండా వుండవలెను.

ఉదాహరణకు:—మీ పన్నులను తోమండి, రాత్రీ, పగలూనూ; వాటిని శుభ్రంగా, వుంచుటకు, పుష్టిగా, తెల్లగానూ.

ఈ పోటీకి వ్రాయబడిన ఊతగీతాలు, కీబా ఫార్మా లిమిటెడ్, వారి స్వంతమైనవగును. మరియు, వారు ప్రచారకార్యాలకు ఈ ఊతగీతాలను ఉపయోగించుటకు అనుమతించబడుదురు.

గెలుపుదారులకు లిఖితపూర్వకంగా తెలుపబడును. దీనినిగురించి ఏవిధమైన ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు.

మా నిర్ణయమే తుదినిర్ణయం:

బినాకా కంపెనీలో పనిచేయువారియొక్క పిల్లలు ఈ పోటీలో పాల్గొనుటకు అంగీకరించబడరు.

ఈ చుక్కల గీతపొడుగునా కత్తిరించండి

ENTRY FORM — Cut along dotted line




with chlorophyll

The daily use of

**BINACA prevents tarter formation**

**Strengtens delicate gums**

Valuable for the preservation of Children teeth

**Keeps the mouth fresh and the teeth white**

**THE SULPHO-RICINOLEATE TOOTHPASTE**

**BiNACA GREEN**

Reg. T. M.

ముగింపు తేదీ 15 ఏప్రిల్ 1955

పేరు ..................................................

చిరునామా ..................................................

..................................................

తప్పుల సంఖ్య ..................................................

ఊతగీతం (12 మాటలు మాత్రమే) ..................................................

..................................................

కీబా, పోస్టుబాక్సు నం. 1123 (కాంపిటీషన్) బొంబాయి - 1. కి, పోస్టులో పంపండి.

ఎల్లప్పుడు

'చాంపియన్'నే

కొనండి.

ప్రతి చోటను దొరకు

నాణ్యమైన

ఫౌంటెన్

కలము

వెల

రు. 3/8




గుజరాత్ ఇండస్ట్రీస్, బొంబాయి-2.

## చందాదారులకు మనవి



పైనెల చందమామ యీనెల చివరి వారంలో పోస్టు అవుతవి. సకాలంలో అందనివారు, వారి పోస్టాఫీసులో ఫిర్యాదు చేస్తూ, పై నెల పదోతేదీలోగా మాకు తెలియపర్చ గోరుతాము. ఆ పైబడువచ్చు కంప్లెయింట్లు, గతనెలలో చేరలేదనే కంప్లెయింట్లు గమనించబడవు.

మేనేజరు

## హోం సినిమా ప్రొజెక్టర్



ఈ పోర్టబిల్ ప్రొజెక్టర్‌తో, మీరు మీ ఇంటివద్దనే నిజమైన సినిమావల్ల కలిగే ఆనందాన్ని పొందవచ్చును. దీనిని టార్చివల్లగాని, ఎలక్ట్రిసిటీ (ఎసి లేక డిసి) వల్లగాని, 35 మిల్లిమీటర్ల ఫిలిమ్ ఉపయోగించి నడపవచ్చును. (4 అ. × 4 అ.) పూర్తిఐన సైజులోనూ, రంగులలోనూ ఒకేసారి బొమ్మ కదలడమూ నటించడమూ కనిపిస్తుంది. 5 గజాల ఫిలిమ్ బొమ్మల రీలున్నూ, ఉపయోగించే విధానమును తెలిపే బొమ్మల పుస్తకమున్నూ ఉచితము. వెల రు. 12-8-0 వి. పి. పి. చార్జీలు రు. 3-0-0. అదనపు ఫిలిమ్ రీలు: గజం ఒకింటికి అ. 0-8-0 స్పెషల్ స్క్రీన్ రు. 3-0-0.

ఉత్తరప్రత్యుత్తరములు ఇంగ్లీషులోనే జరపాలి.

**BHARTENDU-BHAVAN (5) P. O. HATHRAS CITY (INDIA)**

# అదంతా దగ్గుతో ప్రారంభ మైనది...

మొదట తండ్రి దగ్గుతో యింటికి వచ్చాడు....
తరువాత తల్లికి అంటుకుంది. త్వరలోనే పిల్లలు
గూడా దగ్గుట ప్రారంభించారు .... దగ్గు .... దగ్గు
యీ విధంగా మీ కుటుంబములో సంభవించకుండా
చూడండి. పెర్టుసిన్ టెష్నర్ అరవై సంవత్సర
ములపైనుంచి అన్ని విధములయిన దగ్గులకు, కోరింత
దగ్గుతోసహా, త్వరితముగాను, క్షేమముగాను
స్వస్థత చేకూర్చు నివారిణి అని రుజువైనది.




కొనుడు
## పెర్టుసిన్
"టెష్నర్"

అందరు కెమిస్టుల వద్దను లభించును

ఇండియాలో తయారుచేయువారు

**ఇన్‌ఫా లిమిటెడ్**, పోస్టు బాక్సు నెం. 1041, బొంబాయి-1
దిగువ వారితో చేసుకున్న ఒడంబడిక ప్రకారము
ఎటెఫా లిమిటెడ్, షాన్ లీచ్‌టెన్‌స్టెయిన్
స్విస్ కస్టమ్ అండ్ ఎకనామిక్ టెర్రిటరీ

ILY-10-TEL



## ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు





ఇవిగాక - రంగులబొమ్మ కథ - చిత్రకథ,
ఫోటోశీర్షికల పోటీ - మొదలైన మరిఎన్నో ఆకర్షణలు



# డోంగ్రేగారి

## బాలామృతం

బలహీనమైన బిడ్డలకు పుష్టినిచ్చి, పండ్లు మొలిచేటప్పుడు అయ్యే విరేచనములు నిలిపి, బలమును ఆరోగ్యము నిచ్చును.

**K. T. Dongre & Co., Ltd., BOMBAY-4**

---

## 'చందమామ' కు

# ఏజంట్లు కావాలి

★

ఏజంట్లు లేనిచోట్ల ప్రతి ఊరా చిన్న చిన్న ఏజంట్లు కావాలి. మీరు ఏజంటయి కొద్ది కాపీలుకూడా తెప్పించుకోవచ్చును. మీరు ప్రతినెలా **2-0-0** పంపుతూ వుంటే మీకు **7** కాపీలు పంపుతాము. ఈ పద్ధతిని మీకు ప్రతినెలా **0-10-0** లాభం వుంటుంది. పూర్తివివరాలకు వ్రాయండి:

## చందమామ పబ్లికేషన్స్

వడపళని, మద్రాసు - **26**

---

Godrej రిజిస్టర్డ్ గోద్రెజ్

# సిన్థాల్

**జి-11** ★ (హెక్సాక్లోరోఫీన్) కలిసిన సబ్బు ఇది ఒకటే

అందువలన

లావణ్యమును పెంపొందించు సబ్బు నిజముగా ఇదే.

దుర్వాసనను పోగొట్టు సబ్బు నిజముగా ఇదే.

ముఖమునకు, వెంట్రుకలకు ఆదర్శప్రాయమైనది. నేత్రములకు నిరపాయకరమైనది అందువలన శిశువులకు అత్యుత్తమమైనది. చెమటపొక్కులు, నల్ల మచ్చలు, మొటిమలు, కురుపులు, గజ్జి, కాలివ్రేళ్ల పుండ్లు వీటిని అదుపులో పెట్టును.

సిన్థాల్ అన్నిటికంటే మంచిది!




ఆహ్లాదకరమగు పరిమళము గల నురుగు.



★ శక్తివంతముగా పనిచేసి, దురద కలిగించక క్రిములను సంహరించి, దుర్వాసన పోగొట్టు రసాయనక పదార్థముగా సబ్బులలో చేర్చబడు వస్తువులలో మొదటిదిగా ఋజువైనది ఇదే.

# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ ఇరవైఅయిదో తేదీన మనకు సంవత్సరాది పండగ. ఈనాడు వేకువనే లేచి, తలంటుపోసుకోవడం మొట్ట మొదటి పని. ఇది అందరూ ఎల్లప్పుడూ అవలంబించ వలసిన ఆరోగ్యసూత్రం. చాలామంది ముఖ్యమైన పనులు ప్రారంభించడానికి ఈరోజు పర్వంగా యెంచు తారు. ఇవాళ మొదలెట్టిన పని ఏడాదిపొడుగునా చేస్తా మనికూడా ఒక వాడుక. ఈ నమ్మిక, మనల్ని మంచి పనులు చేయుమనడానికే పుట్టినట్టు తోస్తుంది. ఇదిగాక— ఈ ఋతువులో కొత్తగా వచ్చే రకరకాల ఫలజాతులు కలిపి, ఉగాదిపచ్చడి చేసుకుతినడం మన సంప్రదాయం. ఇందులోని వివిధ రుచులు ఎలా ఆప్యాయంతో ఆర గిస్తామో, జీవితంలో మంచి చెడుగులుకూడా సమ భావంతో అనుభవించాలని దీని అంతరార్థంగా చెబుతారు.

మార్చి 1955



సంపుటి 16
సంచిక 3

# కుండపులి!

నర్రా ఊరను గ్రామమందున
నరసయ్యను రైతు
చెఱకుతోటను నాటి పెంచెను
పెరిగె గడలు ఎత్తు!

పైపై దండెము కట్టించాడు
బలె చెఱకుగడలు
నవనవలాడుచు నాకసమంటే
నాణ్యమైన గడలు.

కాని రోజును గుంటనక్కలు
కక్ష గట్టినాయి






పూని గడలను నమలి రసమును
పొట్టల నింపాయి!
నక్కల పోరును తప్పించుటకు
నరసయ యోచించి
కొడుకును బిలిచి పెట్టించాడు
కుండపులిని దెచ్చి—
అనుదినంబును రాత్రిపూటలో
అబ్బా కొడుకున్ను
బూరు బూరుమని కుండను రాచి
పులి యని చాటారు!

పాపం నక్కలు పులిరొప్పులు అని
భయపడి పోయినవి,
ఒక్క నక్కయును చెఱకుదోటల
దిక్కు చూడలేదు.





(గేయకథ)

తండ్రి వచ్చి తన తనయు డుండెనని
తానూ వెనుదిరిగె!

ఒక్క రాత్రిలో నక్కల గుంపు
చిక్కెను తరుణ మని
ఒక్క పిచ్చెయును మిగులనివ్వక
ముక్కలుగా జేసి

వెళ్ళిపోయినవి విజయ గర్వమున
తెల్లవారగానే—
తండ్రీ కొడుకులు తోటను గాంచి
తల్లడిల్లినారు!

ఒక్క రోజున చెఱకుతోటలో
నక్క ఒకటి వచ్చి
పొంచియుండినది రాత్రియంతయు
పులిని జూడనెంచి.

కుండ చర్మమును బూరుబూరు మను
చుండునట్లు రైతు
రాయుచుండగా నక్క నవ్వుకొని
రమ్మని నక్కలను—

ఎవ్వరు లేని సమయం బిదియని
చివ్వున ఆ నక్క
బూరుబూరుమని కుండను కాళ్లతొ
గీరుచుండె నంత!

తండ్రి తోటలో ఉన్నా డనుకొని
తనయుడు వెనుదిరిగె



# అట్టివీది బొమ్మ

పాండవ మధ్యముడైన అర్జునుడు పాశుపతాస్త్రంకోసం వెళ్ళినవాడు ఇంకా తిరిగిరాలేదు. అతని రాకను నిరీక్షిస్తూ తక్కిన సోదరులు ద్రౌపదితో సహా వనవాసంలోనే ఉంటున్నారు. ఇలా ఉండగా—యుధిష్ఠిరుడికి గల బ్రాహ్మణ భక్తినిగురించి విన్న జటాసురుడనే రాక్షసుడు ఒకనాడు బ్రాహ్మణవేషంతో ధర్మరాజువద్దకు వచ్చి, 'నేను సకలవిద్యాసంపన్నుణ్ణి. కొత్త కొత్త అస్త్రశస్త్రాలన్నీ నాకు తెలుసు. వాటిని మీకూ నేర్పదలిచి వచ్చాను' అంటూ పాండవులను నమ్మించాడు. వారు నేర్చుకోడానికి అంగీకరించారు.

ఒకనాటి ఉదయాన ఋషులూ, బ్రాహ్మలూ నదిఒడ్డుకు అహ్నికాలు తీర్చుకోబోయారు. భీమసేనుడు వేటకని అరణ్యానికి వెళ్లాడు. ఇదే సమయమని, కపటబ్రాహ్మణుడైన జటాసురుడు ముందుగా పాండవుల ఆయుధాలను దాచివేశాడు. తరువాత తన నిజరూపంలో ద్రౌపదిని ఎత్తుకొని పారిపోసాగాడు.

అప్పుడు అక్కడ వున్న ధర్మరాజు, నకుల సహదేవులూ ఆయుధాల కోసం వెతుక్కోగా కనబడలేదు. చేసేదిలేక, నిరాయుధులుగానే వారు జటాసురుణ్ణి అటకాయించారు. బలీయుడైన ఆ రాక్షసుడు వారి ముగ్గురినీకూడా చంకనెత్తుకుని పరుగుతీశాడు.

ఐతే, యుక్తిపరుడైన సహదేవుడు చంకనుండి చల్లగా కిందికి జారుకొనిపోయి, ఈ విషయం భీముడికి అందించాడు. ఈలోపల ధర్మరాజు జటాసురుడితో ధర్మవాదనకు దిగి, వాడి వేగం తగ్గించాడు. అంతలోనే గదాయుధుడైన భీమసేనుడు గర్జిస్తూ వచ్చాడు. అది చూచి జటాసురుడు—ధర్మరాజునీ, నకులుణ్ణీ జారవిడిచి, ద్రౌపదినిమట్టుకు ఎత్తుకొని ఆకాశానికి లంఘించాడు.

వెంటనే భీమసేనుడు ఒక మహావృక్షాన్ని పెల్లగించి వాడిని కొట్టేసరికి, వాడు పర్వతంలా నేలను కూలి, ద్రౌపదిని ఒకచోట ఉంచి, భీమసేనునితో కలియబడ్డాడు. ఉభయులకూ మధ్యని ముష్టియుద్ధమే గాక గదలతోను, వృక్షాలతోను గొప్పయుద్ధం జరిగింది. చివరకు, జటాసురుణ్ణి భీమసేనుడు గగనమార్గానికి ఎగరవేయగా, వాడు కిందపడి ముఖం పగిలి చచ్చాడు. ఈ విధంగా పాండవులు ధైర్యంతో కష్టాలను ఎదుర్కొంటూపోయారు.



# గుడ్డి న్యాయం

ఒక గ్రామంలో ఇద్దరన్నదమ్ము లుండే వారు. పెద్దవాడు మోతుబరి. చిన్నవాడు పేదరైతు. చిన్నవాడు ఒకసారి పొలానికి మన్ను తోలవలిసి వచ్చి అన్నదగ్గిరికి వెళ్ళి ఎడ్లూ బండీ ఇవ్వమని అడిగాడు. ఎడ్లకు బాగా ఉలవలుపెట్టి, చీకటి పడేలోగా బండీ వప్పగించే షరతుమీద అన్న ఒప్పుకున్నాడు. తమ్ముడు పని ముగించుకుని బండి అన్న ఇంటికి తొందరగా తోలుకు రావటంలో అజాగ్రత్తవల్ల ఒక ఎద్దు కొమ్ము గోడకు తగిలి అది దాదాపు మొదలంటా విరిగిపోయింది.

అన్న తమ్ముడిపై కోపించి వ్యాజ్యం వేయదలిచాడు. న్యాయాధికారి పొరుగు బస్తీలో ఉన్నాడు. అప్పటికప్పుడే బయలు దేరి అన్నదమ్ములిద్దరూ ఆ గ్రామానికి వెళ్లారు. ఆవూరి పెద్దరైతు ఇంట్లో ఆ రాత్రికి ఉన్నారు. పెద్దరైతు అన్నను చాలా మర్యాద చేశాడుగాని తమ్ముణ్ణి పలకరించనైనా లేదు. తమ్ముడు మధ్యఇంటో ఒక బల్లమీద పడుకున్నాడు. అలిసిపోయి ఉండటంచేత అతనికి కాస్త కునుకు పట్టింది. కలతనిద్రలో అతడు బల్లమీద పొల్లిగిలి కిందపడ్డాడు. కిందనే చాపమీద పెద్దరైతు మనవడు యేడాది వయసువాడు పడుకోబెట్టి ఉన్నాడు. తమ్ముడు ఆ చంటి బిడ్డమీదనే పడ్డాడు. ఆ బిడ్డ కాలు కాస్తా విరిగిపోయింది. వైద్యుడు వచ్చిచూసి అవిటి కాలుతో పెరుగుతాడని చెప్పాడు.

పెద్దరైతుకు చాలా కోపంవచ్చింది. అతడుకూడా పేదరైతుమీద వ్యాజ్యం వేయ నిర్ణయించి న్యాయస్థానానికి బయలుదేరాడు.

పెద్దరైతు ఇంటినుంచి న్యాయస్థానానికి వెళ్ళే దారిలో ఒక కాలవా, దానిపై ఎత్తుగా వంతెనా ఉన్నాయి. పెద్దరైతూ, అన్నా, తమ్ముడూ ఈ వంతెనపైకి వచ్చేసరికి

పి. శ్యామలాకుమారి



తమ్ముడికి ఆత్మహత్య చేసుకుందా మని పించింది. తాను చేసినవి రెండూ తప్పులే. కాదని ఏ న్యాయాధికారి మాత్రం ఎలా అంటాడు ?

'అసలే దరిద్రపు జీవితం. అందులో జైలుబాధకూడా దేనికి ?'

ఈవిధంగా ఆలోచించుకుని పేదరైతు వంతెన మీదినుంచి కాలవలోకి గెంతేశాడు. కాని అదేసమయంలో వంతెన కిందనుంచి ఒక పడవ ఇవతలికి రావటమూ, ఆ పడవ టాపుపైన పడుకుని ఉన్న ఒక మనిషిమీద పేదరైతు పడటమూ, ఆ మనిషి చావ టమూ జరిగింది.



చచ్చిపోయినవాడి కొడుకు పేదరైతును నానా తిట్లూతిట్టి, ఫిర్యాదీలలో ఒకడుగా చేరి న్యాయస్థానానికి బయలుదేరాడు.

పేదరైతు హృదయం భగ్గున మండ సాగింది. తాను ఏంచేసినా నేరమే అవు తున్నది. ఏం చేసేట్టు ?

"ఇన్ని ఘోరాలు తెలియక చేశాను. ఈసారి తెలిసి చేస్తాను. న్యాయాధికారి నాకు విరుద్ధంగా తీర్పిచ్చాడో, వాడి మాడు పగలగొట్టేస్తాను!" అనుకుని పేదరైతు, దారిలో కనబడిన ఇటుకముక్క పెద్దది ఒకటి తన పైపంచలో మూటగట్టుకుని ఫిర్యాదీలతోబాటు న్యాయస్థానానికి వెళ్లాడు.

మొదటగా మోతుబరి అయిన అన్న గారు తమ్ముడిపై ఫిర్యాదు చేశాడు. తన దగ్గిర బండీ, ఎడ్లూ తీసుకుని వాడు కోవటమే గాక బండీ తోలేటప్పుడు బుద్ధి పూర్వకంగా ఒక ఎద్దు కొమ్ము విరగగొట్టా డని అన్న న్యాయాధికారితో అన్నాడు. ఈ సమయంలో తమ్ముడు తన పైబట్ట కొంగున కట్టిఉంచిన ఇటుకరాతి మూట ఎత్తి న్యాయాధికారికి చూపించాడు.

ముద్దాయి తనకో వంద రూపాయలిస్తా నని సంజ్ఞ చేస్తున్నాడనుకుని న్యాయాధి కారి ఈవిధంగా తీర్పుచెప్పాడు :





"నీ యెద్దు కొమ్ము విరగగొట్టాడు కనక ఆ కొమ్ము తిరిగి పెరిగేదాకా ఆ ఎద్దు మేత ఖర్చులు వగైరా తానే భరిస్తూ ఎద్దును తన వద్దనె ఉంచుకోవలిసింది."

రెండవ ఫిర్యాదు బస్తీకి చెందిన పెద్ద రైతుది. ముద్దాయి బల్లమీదినుంచి పడి చంటివాడి కాలు శాశ్వతంగా అవిటికాలు చేసేశాడని ఫిర్యాదు.

ఈసారికూడా తమ్ముడు ఇటుకరాతి మూట చూపి న్యాయాధికారిని బెదిరించాడు. మళ్ళీ ఇంకో వందరూపాయలు లంచంకింద ముట్టుతవని న్యాయాధికారి ఈ విధంగా తీర్పు చెప్పాడు:

"ఫిర్యాది మనవడి కాలు శాశ్వతంగా అవుడయిపోయింది కనుక, ముద్దాయి తన కుమారుణ్ణి, ఏడాది వయసువాణ్ణి ఫిర్యాదికి ఇచ్చి ఆ అవిటి కుర్రవాణ్ణి తీసుకోవాలి. ముద్దాయికి ఆ వయసుగల కొడుకు లేని పక్షంలో, కొడుకు కలిగి ఏడాదివాడయేదాకా ఫిర్యాది ఆగాలి."

మూడవ ఫిర్యాదు పడవప్రయాణీకుడి కొడుకుది. ముద్దాయి వంతెనమీదినుంచి పడవపైభాగాన ఉన్న ఫిర్యాది తండ్రిపై దూకటంచేత ఫిర్యాది తండ్రి చనిపోయాడు. ఇందుకుగాను ముద్దాయికి తగు శిక్ష విధించాలి.




మూడోసారి పేదరైతు తన మూటను న్యాయాధికారికి గట్టిగా చూపాడు. తనకు మూడోవంద లంచం ముట్టబోతున్నదనుకుని న్యాయాధికారి సంతోషించి ఈ విధంగా తీర్పుచెప్పాడు.

"ముద్దాయి పడవపై ప్రయాణం చేయాలి. ఆ పడవ సరిగా వంతెనకిందుగా వచ్చినప్పుడు చచ్చిపోయినవాడి కుమారుడైన ఫిర్యాది వంతెనపైనుంచి ముద్దాయి మీదికి దూకాలి."

విచారణ ముగిసింది. ఈ గండాలు మూడూ గడిచి బయటపడినందుకు సంతోషిస్తూ పేదరైతు బయటికి వస్తుండగా



న్యాయాధికారి బంట్రోతు అతడి దగ్గరకు పరుగెత్తుకుంటూ వచ్చి :

"బాబుగారు, తమరి నడిగి వెంటనే మూడువందలూ పట్టుకురమ్మంటున్నారు!" అంటూ తొందరచేశాడు.

"మూడువంద లేమిటి?" అన్నాడు పేదరైతు.

"మూడు కేసులకూ లంచమిస్తామని మూట చూపించారుటగా?" అన్నాడు న్యాయాధికారి బంట్రోతు.

పేదరైతుకు మండిపోయింది. "ఇదుగో, చూడు! ఈ మూటలో ఉన్నది డబ్బుకాదు. ఇటుకరాయి! మీ న్యాయాధికారి నాకు విరుద్ధంగా తీర్పు చెప్పివుంటే, తరవాత ఏమైనాసరే, దీంతో ఆయన బుర్ర పగలగొట్టేవాణ్ణి. ఆపని చేస్తాననే సంజ్ఞచేశాను. వెళ్ళి ఆయనతో చెప్పు," అన్నాడతను.

బంట్రోతు మాటలు విని న్యాయాధికారి, "బతుకుజీవుడా! వాడికి విరుద్ధంగా తీర్పు చెప్పానుకాను. లేచినవేళ మంచిది!" అనుకున్నాడు.

తమ్ముడు న్యాయస్థానం దాటిరాగానే అన్న వచ్చి చేతులు రెండూ పట్టుకుని, "తమ్ముడూ, అయిందేదో అయింది. నా ఎద్దును విడిచావంటే నూరు రూపాయ



లిచ్చుకుంటాను. చాలా డబ్బుపోసి కొన్న ఎద్దు," అన్నాడు.

తమ్ముడు మారుమాటాడలేదు. అన్న ఇచ్చిన డబ్బుసంచీని మెదలకుండా రొండిన దోపుకున్నాడు.

అన్న బ్రతికి బయటపడ్డాంరా బాబూ అనుకుంటూ వెళ్ళిపోయాడు.

కొంతదూరం నడిచేసరికి పెద్దరైతు వచ్చి పేదరైతుతో, "చూడు, బాబూ! అవుడో, చెవుడో, నా మనవణ్ణి నాయింటనే పెరగనీ. నాలుగు పుట్లు మంచిధాన్యం నా బళ్ళమీద తోలించిపెడతాను. ఇదికూడా ఉంచు. మా వూరు వచ్చి మా యింట రెండుపూటలుండకుండా వెళితే నే నూరు కునేది లేదుసుమా!" అంటూ చేతికి ఒక సంచీ అందించాడు.

తమ్ముడు పెద్దరైతు యిచ్చిన డబ్బు సంచి తీసుకుని వీలయినప్పుడు అతని యింటికి అతిథిగా వస్తానని చెప్పాడు.

తరవాత పడవప్రయాణీకుడు అతణ్ణి సమీపించాడు.

"అయ్యా, చూడండీ! నేను మొదటి నుంచీ వద్దంటూంటే మావాళ్ళు పోరి ఫిర్యాదుచేయించారు. మీరుమాత్రం మా నాన్నను కావాలని చంపారుగనకనా? మీరు నన్నింతతో వొదిలిపెడితిరా మీకు నా శక్తికొద్దీ ఇచ్చుకుంటాను," అంటూ బరువైన సంచీ ఒకటి చేతికిచ్చి, ఒక్క దణ్ణంపెట్టి దాటిపోయాడు.

ఇంతకాలానికి తమ్ముడి దరిద్రం తీరి పోయింది. చెడుకూడా ఒక్కొక్కప్పుడు మంచికే వస్తుందనుకుంటూ అతను ఇంటికి వెళ్ళిపోయాడు.

తరవాత ఆ వచ్చిన డబ్బులో కొంత పెట్టి ఒక జత ఎడ్లనూ, మిగిలిన డబ్బుతో కొంత పొలం కొన్నాడు.

ఆనాటినుంచీ సొంత వ్యవసాయం చేసు కుంటూ సుఖంగా జీవితం గడిపాడు.






# పరువైన బ్రతుకు

ముస్లిములకు పవిత్రయాత్రా స్థలమైన మక్కానగరపు రాజవీధి వెంబడి ఒకనాడు ఇస్లాముమత ప్రవక్త అయిన మహమ్మద్ నడిచివెళుతున్నాడు. ఇంతలో ఒక ముష్టి వాడు ఆయనను సమీపించి, "అయ్యా, నిరుపేదకు ధర్మం చెయ్యండి. అల్లా కటాక్షం ఉంటుంది," అని యాచించాడు.

మహమ్మద్ ఆగి ముష్టివాణ్ణి పరిశీలించాడు. వాడు అంతే వయసుగలవాడు కాడు. చేతిలో ఒక మూకుడున్నది. చిరిగి పోయి మాసి మట్టికొట్టుకుని వున్న ఒక గొంగళి కప్పుకున్నాడు. వాడిలో దైన్యం ఉట్టిపడుతోంది.

"ముష్టి ఎత్తుకోవలసినంత నిరుపేదవా?" అని అడిగాడు మహమ్మద్.

"అయ్యా, ఈ ప్రపంచంలో నాకున్న దల్లా ఈ గొంగళీ, ఈ మూకుడూ మాత్రమే," అన్నాడు బిచ్చగాడు.

"అయితే వాటిని నా కిచ్చెయ్యి!" అన్నాడు మహమ్మద్.

మహమ్మద్ ఉద్దేశం గ్రహించలేక బిచ్చగాడు తన గొంగళీ, మూకుడూ ఆయన కిచ్చేశాడు. వెంటనే మహమ్మద్ వాటిని దారేపొయ్యేవారికి అమ్మేశాడు. నిజానికి వాటికి విలువ ఏమీలేదు. కాని అమ్మిన వాడు మహమ్మద్ కనక వాటికి చాలా మంచి ధరే వచ్చింది.

ఇదిచూసి బిచ్చగాడు లబలబలాడాడు:

"అయ్యా, నాకున్న సొత్తు కాస్తా అమ్మేశారు. గొంగళీ లేకపోతే ఈ రాత్రికి నేనేం కప్పుకోను? మూకుడు లేకుండా ఎందులో అన్నం తినను?"

మహమ్మద్ తాపీగా జవాబిచ్చాడు:

"నాయనా, అవి నీ సొత్తుకాదు, నీ అవమానం. అవి ఉన్నంతకాలం నీకు మానవత్వం లేదు. ఈ డబ్బు తీసుకుపోయి బజా

గోళ్ళ శివాజీరావు

రులో గొడ్డలి ఒకటి కొనుక్కో. దానితో అడవిలో కట్టెలు కొట్టు. వాటిని తెచ్చి విక్రయించి ఆకలి బాధా, చలి బాధా తీరే ఉపాయం చూసుకో. ఇప్పటి నీ స్థితిలో పరువైన బ్రతుకు నీకు మొదట్లో బాధాకరంగానే ఉంటుంది. అయినా పట్టుదల వదలకు. రెండు వారాల అనంతరం నాకు మళ్ళీ కనిపించు!" అన్నాడు.

గత్యంతరం లేక బిచ్చగాడు ప్రవక్త చెప్పినట్టే చేశాడు. గొడ్డలి ఒకటి కొన్నాడు. దానితో అడవికి పోయి కట్టెలుకొట్టి వాటిని అమ్ముకుని జీవించసాగాడు.

రెండు వారాలు గడిచాయి. ఆ వ్యక్తి తిరిగి ప్రవక్తను చూడవచ్చాడు. మహమ్మద్ అతన్ని గుర్తించలేకపోయాడు. ఎందుకంటే ఇప్పు డా మనిషిలో ఏమీ దైన్యంలేదు. శరీరం దృఢంగా ఉంది. చూపులో చురుకుతనం వచ్చింది. చవుక బట్టలే కట్టినా శుభ్రంగా ఉన్నాయి.

"అయ్యా, నాకు కొత్త జీవితం ప్రసాదించారు. ఒకరిని చెయ్యిచాచి అడగకుండా నా పొట్ట నేను పోసుకొంటున్నాను. ఇంకొకరిని పోషించగల స్థితిలోకూడా ఉన్నాను. నా ఆరోగ్యంకూడా బాగున్నది!" అన్నాడు మాజీ బిచ్చగాడు.

"కరుణామయుడైన అల్లాకు చెయ్యెత్తి నమస్కరించు. నీవు నీ జీవితాన్ని బాగు చేసుకోవటమే గాక, నీ మూలంగా ఈ దేశానికి కలుగుతున్న అవమానాన్ని తొలగించావు. ఇది యాత్రాస్థలం. ఇక్కడికి వేనకువేలు జనం ప్రపంచం నాలుగు మూలలనుంచీ వస్తారు. నీ మాతృదేశంలో మానవత్వాన్ని కోల్పోయిన బిచ్చగాళ్ళున్నారని వారు తమ దేశాలకు పోయి చెప్పుకుంటారు. అంతకన్న అవమానకరమైనదేమైనా ఉందా? కాయకష్టం చేసి జీవించటంకన్న పరువైన పని మనిషికి లేదు!" అని మహమ్మద్ హితబోధ చేశాడు.





# సూర్యునితో పందెం

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పాలించే కాలంలో ఒకప్పుడు, చిత్రకూట పర్వత ప్రాంతాన తొంభైవేల హంసలు నివసిస్తూ ఉండేవి. ఆ కాలమందే బోధిసత్త్వుడు ఒక హంసగా జన్మించాడు. ఈ హంస అనేకమైన సుగుణాలతోపాటు అపరిమితమైన వేగం కలిగివుండటంచేత, తొంభైవేల హంసలకూ అది పెద్దఐంది.

ఇన్ని ఉత్తమ గుణాలూ, శక్తులూగల ఈ హంసల పెద్దకు 'రాజహంస' అని పేరు.

ఒకనాడు రాజహంస, తన గుంపుతో సహా, సరోవరంలో విహరించి ఇంటికి మరలుతూ, కాశీరాజ్యంగుండా రావడం తటస్థించింది. బ్రహ్మాండమైన ఆ పక్షుల గుంపు చూస్తే, కాశీరాజ్యమంతటా బంగారు చాందినీ పరిచినట్టుగా వుంది. కాశీరాజు ఆశ్చర్యంతో అటు పరికించాడు. ఆ పక్షులన్నిటిలోనూ, చుక్కలలో చంద్రుడిలా వెలిగిపోయే రాజహంస కాశీరాజును మరింత ఎక్కువగా ఆకర్షించింది.

ఆ రాజహంసలో మంచి ఠీవీ, తేజస్సు మొదలైన రాజలక్షణాలు ఉండటం కాశీరాజు గమనించాడు. దివ్యమైన పుష్పమాలికలు, పూజాద్రవ్యాలూ తెప్పించి, వాటితో రాజహంసకు స్వాగతమిచ్చాడు.

ఘనమైన ఈ స్వాగతం ఆప్యాయంతో అందుకొన్నది రాజహంస. తన పరివారంతో కూడ కొన్నాళ్ళు అక్కడ వుండి, కాశీరాజు ఆతిథ్యం పొంది, ఇంటికి మరలిపోయింది.

ఆ క్షణంనుంచీ కాశీరాజుకు రాజహంసపైన గల మమత మరింత అతిశయింపసాగింది. ఇప్పుడాయన మనస్సంతా రాజహంసపైనే ఉంటున్నది. అహర్నిశలు దానినిగురించే తలంపు. ఏ క్షణమందు ఏ దిశనుండి ఆ రాజహంస వస్తుందో అని వెయ్యి కళ్ళతో కనిపెట్టి చూస్తూవుండేవాడు.

ఒకనాడు చిత్రకూట పర్వతప్రాంత మందలి హంసలలో రెండు చిన్నారి హంసలు రాజహంసవద్దకు వచ్చి, "రాజా! మాకు సూర్యునితో పందెం కడదామని సరదాగా వుంది" అంటూ, వాటి మనస్సు లోని ఉద్దేశం వెల్లడించినై.

ఈ మాటకు రాజహంస "ఓసీ కూనల్లారా! —సూర్యుడితో యేమిటి, మీరు పందెం కట్టడమేమిటి? విడ్డూరం!— సూర్యుని వేగం ఎంతటిదో మీకు తెలియదు. కనుకనే అజ్ఞానంలో పడ్డారు. మీరు ఆయనతో పరుగెత్తలేరు సరికదా, పందెంలో మీకు ప్రమాదమూ, ప్రాణాపాయమూ కూడా కలగవచ్చు. అందుచేత, మీరిద్దరూ ఈ పిచ్చి వూహలు కట్టిపెట్టండి," అని హితవు చెప్పింది.

హంసపిల్లలకు ఆ హితవు నచ్చలేదు. మళ్ళీ మరొకనాడు పోయి రాజహంసను అనుమతి కోరినై. ఈసారీ అలానే చెప్పింది రాజహంస. అంతటితోనైనా ఊరుకోకుండా మూడోసారి పోయి మళ్ళీ అడిగినై పిల్లలు. ఈమారూ రాజహంస అంగీకరించలేదు.

ఇది పనికాదని తలచి, తమ సత్తువ తెలియని హంసపిల్లలు రెండూ, యజమానికి తెలియకుండానే యుగంధర పర్వత




శిఖరానికి ఎగిరిపోయినై. ఈ శిఖరం, సూర్య మండలానికి తాకుతున్నదా అనిపించేటంత ఎత్తయింది. కనుక ఆ శిఖరంమీద మకాం చేసి, సూర్యునితో పందెం వేదామని హంస పిల్లల వూహ.

యథాప్రకారం రాజహంస తన పరివారాన్ని లెక్కచూచుకోగా రెండు హంసలు తగ్గినై. జరిగిన సంగతి గ్రహించి, అది విచారించింది. విచారిస్తే లాభమేముంది! వాటిని ఎలా ఐనా రక్షించాలనుకుంది.

వెంటనే తనుకూడా యుగంధర పర్వత శిఖరానికి చేరుకుని, హంసపిల్లలకు తెలియని విధంగా ఒకచోట కూర్చుంది.

సూర్యోదయం కాగానే హంసపిల్లలు సూర్యునితోపాటు, ఎగర సాగినై. రాజహంస కూడా వాటిని అనుసరించింది.

హంసపిల్లలు రెండింటిలో చిన్నది మధ్యాహ్నంవరకూ ఎగిరి, రెక్కలలో మంటపుట్టి, సోలి పడిపోయింది. పడిపోయే టప్పుడు దానికి రాజహంస కనబడగా, "రాజా!—నావల్ల కాలేదు. ఓడిపోయాము..." అన్నది, నిస్పృహతో. అప్పుడు రాజహంస 'ఫరవాలేదు, నేనున్నానుగా!' అంటూ, మంచి మాటలతో దానిని రెక్కలపై కెక్కించుకుని పోయి ఇంటివద్ద తక్కిన గుంపుతో చేర్చింది.

మరి కొంచెంసేపటికి రెండవ హంస పిల్లకుకూడా రెక్కలలో సూదులు పొడిచి నట్టు బాధ కలిగి, సోలిపోయింది. అదీ రాజ హంసను చూచి నిస్పృహతో దీనంగా పలికింది. దానికికూడా రాజహంస ధైర్యం చెప్పి, రెక్కలపై ఎక్కించుకొని, చిత్ర కూటం చేర్చింది.

ఈవిధంగా తన పరివారంలోని రెండు పక్షులు ఓడిపోవటం సహించలేక, రాజ హంస తనే పందెంవేయాలని బయల్దేరింది. చెప్పనలవికాని సహజవేగం గల రాజ హంస ఎగరడం ప్రారంభించిన కొద్ది సేపట్లోనే సూర్యబింబాన్ని కలుసుకోవడం



దాటిపోవడమూకూడా జరిగింది! సూర్యుని సత్తువ ఎంతటిదో చూదామనుకొన్నది కాని, రాజహంసకు పందెం ఎందుకు? దీనివల్ల దానికి కలిసివచ్చేదేమిటి?

కనుక, ఇష్టంవచ్చినట్టు కొంచెంసేపు చుట్టి చుట్టి, చివరకు అలసటచేత భూలో కానికి దిగివచ్చి, కాశీరాజ్యం చేరుకున్నది. కన్నులు కాయలుకాచేటట్టు కనిపెట్టుకొని వున్న కాశీరాజు రాజహంసను చూడగానే తన్మయుడైపోయాడు.

రాజహంసను తన బంగారు సింహాసనం మీద కూర్చోబెట్టి, బంగారు పళ్ళెంతో పాయసం, బంగారు కలశతో చల్లటి పానకం తెచ్చి దాని ముందు పెట్టారు. అది కొంచెం స్తిమితపడ్డ తరువాత రాజు కుశలప్రశ్నలు ప్రారంభించాడు. జరిగిందంతా పూసగుచ్చి నట్టు చెప్పింది రాజహంస.

అది చెప్పిందంతా విని, రాజు, 'పక్షి రాజా!-సూర్యునితోనే పందెంకట్టి, అతనిని మించిన నీ ప్రజ్ఞ ఎటువంటిదో చూడ వేడుకగా వున్న'దన్నాడు. అప్పుడు రాజ హంస రాజుకు తన శక్తిని చూపించదలిచి, 'రాజా!—నీ రాజ్యంలో, మెరపు మెరసే టంతకన్న వేగంగా బాణం వదలగల మేటి విలుకాండ్రు వుంటే వారిలో నలుగురను



ఇక్కడికి రప్పించు.' అన్నది. రాజు విలుకాండ్రను పిలిపించాడు.

ఉద్యానవనంలో ఒక నలుచదరపు స్తంభం ఉన్నది. విలుకాండ్రు నలుగు రనూ ఆ స్తంభం నాలుగువైపులా నించో బెట్టింది రాజహంస.

తరవాత తన మెడకు ఒక గంట కట్టుకుని, స్తంభంపైన కూర్చున్నది.

'నేను సంజ్ఞ చేయగానే మీరు నలు గురూ బాణాలు వదలండి. నేను ఎగిరి వెళ్లి, మీ ఒక్కొక్కరి బాణమే తెచ్చి మీ ముందు పెడతాను. ఐతే, నా మెడలో ఉండే గంట చప్పుడువల్లనే మీరు నా గమనాన్ని

తెలుసుకోగలరుగాని, నన్ను కంటితో చూదామంటే ఎంతమాత్రం సాధ్యంకాదు'' అని చెప్పింది. ఆ ప్రకారమే, మెరపు మెరసేటంతలో విలుకాండ్రు వదిలిన నాలుగు బాణాలూ తెచ్చి రాజహంస, వాళ్ల వాళ్ళముందు పెట్టింది.

రాజూ, పరివారమూ ఆశ్చర్యభరితులయారు 'రాజా !—చూచావా నావేగం! ఇది, నేను అతి మెల్లగా ఎగిరినప్పటి కనీసపు వేగం అన్నమాట. దీన్నిబట్టి అసలు, వేగం అనేది ఎటువంటిదో ఊహించగలవేమో చూడు' అన్నది.

ఆత్రంతో రాజు 'పక్షిరాజా !—నీ వేగం ఎటువంటిదో మచ్చు చూడగలిగాము. మరి, ఇంతకు మించిన వేగం మరెవరికైనా ఉన్నావా ?' అని ప్రశ్నించాడు.

అందుకు రాజహంస '' లేకేమి !—నేను నాశక్తి అంతా వినియోగించి అత్యంత వేగంగా ఎగిరినప్పటికీ నాకంటె వెయ్యిరెట్లు వేగంతో పరుగుతీసే మహాశక్తి ఒకటి ఉన్నది. అదే 'కాలం' అనే సర్పం!—ఆ కాలసర్పం అనుక్షణమూ ఈ ప్రపంచమందలి జీవులను వర్ణింపతరంకాని ప్రచండ వేగంతో నాశనం చేస్తున్నది...'' అని చెప్పేసరికి, రాజు భయంతో కంపించిపోయాడు.

అప్పుడు రాజహంస రూపంలో ఉన్న బోధిసత్వుడు కాశీరాజకు ఈ విధంగా తత్వబోధ చేశాడు :

'' రాజా !-కాలసర్పం ఒకటి ఉన్నదన్న మాట గుర్తుంచుకొన్నవాళ్ళకు భయపడపనేలేదు. నీతిమంతుడవై, ధర్మాత్ముడవై, పరిపాలన సాగించేటంతవరకూ నీకు ఎవ్వరివల్లనూ ఎట్టిభయమూ లేదు. కనుక నీ విధులు నీవు సక్రమంగా నెరవేర్చుకో'' అని హితవుచెప్పాడు.

బోధిసత్వుడు చెప్పిన హితవుప్రకారం కాశీరాజు ధర్మపాలనచేసి, కీర్తిగడించాడు.






## 15

[శివదత్తుణ్ణి వెతుక్కుంటూ బయలుదేరిన సమరసేనుడు అదృష్టవశాత్తూ తన సైనికులు మొసలి వాత బడకుండా కాపాడాడుగదా? వాళ్ళద్వారా వ్యాఘ్రదత్తుడు ఎటు వెళ్ళుతున్నదీ గ్రహించాడు. శివదత్తుడు హెచ్చరికగా చెట్టుకు కట్టిపోయిన పత్రంకూడా అతడి కంటబడింది. కాని అదేసమయంలో అతణ్ణి వ్యాఘ్రదత్తుడు ఎదిరించాడు. తరవాత—]

సమరసేనుడు తమపై బాణవర్షం కురిపిస్తున్నవా రెవరైందీ తెలుసుకునేందుకు ఆట్టే కాలం పట్టలేదు. "వ్యాఘ్రదత్తుడికీ జై! వ్యాఘ్రమండలానికీ జై" అన్న వాళ్ళ కేకలూ, అరుపులూ కొండగుహలు ప్రతిధ్వనించేలా వినబడుతున్నయ్.

"వీళ్లు వ్యాఘ్రదత్తుడి భటులు, మనము వున్నచోటు తెలుసుకున్నారు. హఠాత్తుగా దాడిచేసి మనందర్నీ హతమార్చాలని చూస్తున్నారు," అని సమరసేనుడు సైనికులను హెచ్చరించాడు.

వ్యాఘ్రదత్తుడి భటులు కొండరాళ్ళ వెనక పొంచివుండి, సమరసేనుడిపైనా, అతడి సైనికులపైనా బాణాలు ప్రయోగిస్తున్నారు. ఇలాంటి పరిస్థితిలో బ్రతికి బయటపడాలంటే అతడికి ఒక్కటే మార్గం కనబడింది—రాళ్ళచాటున దాక్కుంటూ ఆ ప్రదేశాన్నుంచి పారిపోవడం!

సమరసేనుడితోపాటు సైనికులుకూడా నిశ్శబ్దంగా రాళ్ల వెనక నక్కుతూ, ఎదురుగా వున్న సొరంగంకేసి పాకసాగారు. ఆ సొరంగం ఎక్కడికి దారితీస్తుందో—అవతల



ఏమున్నదో అన్న సంశయం వాళ్ళను అంతగా బాధించలేదు. ముందు వ్యాఘ్రదత్తుడి వలనుంచి బయటపడటంమీదే వాళ్లు దృష్టిని కేంద్రీకరించారు.

చివరకు అందరూ సురక్షితంగా ఒక చీకటిగుహ చేరారు. వ్యాఘ్రదత్తుడి భటుల అడుపులూ, కేకలూ క్రమంగా తగ్గసాగినై. వాళ్ళు తమను వెతుకుతూ మరోదారిన పోయారని సమరసేనుడు వూహించాడు.

అప్పటికి బాగా ప్రొద్దెక్కి సరిగా మిట్ట మధ్యాహ్నమయింది. సమరసేనుడు చీకటిగా వున్న గుహలో తడుముకుంటూ కొంచెం ముందుకు సాగాడు. అతడికి ఆ



రెండవకొసనుంచి సన్నని సూర్యకాంతి కనిపించింది. అతడు మరికొంత ముందుకు నడిచి గుహకు అవలివైపు చేరాడు.

సమరసేనుడు తన కళ్ళను నమ్మలేక పోయాడు. ఇది కలా, నిజమా అనిపించింది. ఎట్టఎదుట పటంలో శివదత్తుడు కనబరిచిన శిథిలాలు కంటబడినై. ఏదో ఒక మహా నగరం భూకంపంవల్ల సర్వనాశనం అయి నట్టు, పెద్దపెద్ద భవనాలు గోడలు విరిగిపడి, స్తంభాలు పగిలిపోయిన స్థితిలో—అతడికి ప్రత్యక్షమయినై.

అది శివదత్తుడు పటంలో సూచించిన శిథిలనగరం అనేందుకు సందేహం లేదు. శివదత్తుడు యిక్కడనే-ఎక్కడో దాక్కొని వుంటాడు. తను ధైర్యంచేసి ముందుకు వెళ్లటమే మంచి దనుకున్నాడు సమరసేనుడు. అతడి సైనికులుకూడా, ఆశ్చర్యంగా ఆ శిథిలనగరంకేసి చూస్తున్నారు.

ఇప్పుడు ఏంచేయాలి? అనే ఆలోచన కలిగి సమరసేనుడు ఒక నిర్ణయానికి వచ్చేటంతలో-ఆ ప్రదేశమంతా దద్దరిల్లేట్టు శంఖనాదాలూ, కేకలూ వినిపించినై. మరు క్షణం దాదాపు యాభై అరవైమంది భటులతో వ్యాఘ్రదత్తుడు ఆ శిథిల భవనాల మార్గాన వస్తున్నాడు.



సమరసేనుడు సైనికులను హెచ్చరించి, వ్యాఘ్రదత్తుడు ఎటు వెళతాడా అని వేయి కళ్ళు చేసుకుని చూడసాగాడు. వ్యాఘ్రదత్తుడి వాలకం చూస్తే–అతడు తమ మాటే మరచిపోయినట్టు కనబడుతోంది.

అతడు తను సాధించ దలుచుకున్న మహాకార్యం సాధించినవాడిలా ముందు ధీమాగా నడుస్తున్నాడు. ఇక భటులు నవ్వుతూ, కేరింతలు కొడుతున్నారు.

శివదత్తుడు ఎక్కడ దాక్కున్నదీ గ్రహించి వ్యాఘ్రదత్తుడు అతణ్ణి బందీగా పట్టుకున్నాడా? అన్న అనుమానం కలిగింది సమరసేనుడికి. కాని భటులవెంట బందీ చేయబడినవారెవరూ లేరు. 'బహుశా అపూర్వశక్తులు గల శాక్తేయుడి త్రిశూలం ఎక్కడవున్నదీ అతడికి తెలిసిపోయి వుండవచ్చు' అనిపించింది సమరసేనుడికి.

వ్యాఘ్రదత్తుడు శిథిలమైపోయిన భవనాలవెంట తన భటులను నడిపించసాగాడు. అతడు వెళ్ళవలసిన చోటు ఏదో ముందే నిర్ణయించుకున్నట్టు సూటిగా భటులకు దారిచూపుతున్నాడు.

ఇలాంటి అదనుకోసమే వేచివున్న సమరసేనుడు రాళ్లచాటున నక్కుతూ తన సైనికులతో ఒక శిథిలమైవున్న పెద్ద భవన ప్రాంగణం చేరుకున్నాడు. అక్కడ సగం






విరిగీ, పడిపోయివున్న స్తంభాల చాటున వుండి జాగ్రత్తగా చూడసాగాడు.

వ్యాఘ్రదత్తుడు భటులముందు నడుస్తున్నవాడల్లా ఒకచోట ఠక్కున ఆగి "వ్యాఘ్రయోధులారా! మన శ్రమ ఫలించే రోజు వచ్చింది. మీలో ప్రతిఒక్కణ్ణీ ఒక దేశానికి రాజుగా చేస్తానని వాగ్దానంచేశాను గదా? ఆ వాగ్దానం నిలుపుకుంటాను. కాని మీరు ఈ నిమిషాన ఒక సాహసకార్యం చెయ్యవలసివుంది!" అన్నాడు గంభీరంగా.

"మేము ఎంతటి సాహసకార్యానికైనా సంసిద్ధులమే! అదేమిటో చెప్పండి," అంటూ భటులు కేకలు వేశారు.



వ్యాఘ్రదత్తుడు మందహాసంచేస్తూ "ఈ శిథిలనగరంలో మన కోర్కెలు నెరవేరబోతున్నవి. అదుగో, ఆ కనబడే భవనం చూశారుగదా? దాని సింహద్వారం విరిగిపోయి రాళ్లతో కప్పబడి వుంది. మీరు అక్కడ అడ్డుగా వున్న రాళ్ళనూ, స్తంభాలనూ తొలగించి మార్గం సరిచేయండి. మనం వెతికిపట్టవలసిన అమూల్యవస్తువు ఆ భవనంలోనే వుంది, దానికి మార్గం సింహద్వారాన్నుంచి," అన్నాడు.

వ్యాఘ్రదత్తుడు ఇలా చెప్పేసరికి భటులలో ఎక్కడలేని ఉత్సాహమూ పుట్టుకొచ్చింది. వాళ్ళు నవ్వుతూ, కేకలు వేస్తూ, హెచ్చరికలు చేసుకుంటూ ఆ శిథిలభవనాన్ని సమీపించారు. కొందరు పలుగులు తీసుకుని ద్వారానికి అడ్డుగా వున్న పెద్ద పెద్ద గండశిలలను పక్కకు నెట్టసాగారు.

భటులు వాళ్ళ ఉత్సాహంలో, దురాశలో మునిగి తమకు రానున్న ప్రమాదాన్ని గ్రహించలేదు. శిథిలమైపోయిన ఆ భవనం తాలూకు గోడలూ, స్తంభాలూ పక్కలకు ఒరిగి పడేందుకు సిద్ధంగా వున్నవి.

దూరంగా వుండి ఇదంతా గమనిస్తున్నాడు సమరసేనుడు. వ్యాఘ్రదత్తుడి ఆజ్ఞాపాలన చేస్తున్న భటులు ఏ గోడో, స్తంభమో విరిగి





మీదపడటంతో బలవంతపు మరణం చెందుతారని తోస్తూనేవుంది.

వ్యాఘ్రదత్తుడుమాత్రం కొంచెం ఎడంగా నిలబడి రాళ్ళను పక్కలకు లాగుతూన్న భటులకు ఉత్సాహం కలిగిస్తున్నాడు. అతడు పక్కలకూ, భవనంకేసీ చూస్తూన్న ధోరణిబట్టి—అతడికూడా రానున్న ప్రమాదం తెలుసుననేది సమరసేనుడు గ్రహించగలిగాడు.

వ్యాఘ్రదత్తుడు కావాలనే తన భటులను ఇలాంటి ప్రమాదంలో చిక్కుకునేట్లు చేస్తున్నాడు. ఈ వూహ సమరసేనుడికి కలిగేటంతలో పెళపెళా రావాలతో శిథిల



భవనం ఒక్కసారిగా కిందకు కూలింది. విరిగిపడుతున్న స్తంభాలకిందా, గోడల కిందా పడి వ్యాఘ్రదత్తుడి భటులు చాలా మంది హాహాకారాలు చేస్తూ తృటిలో మరణించారు. అదృష్టవశాత్తూ ప్రమాదంనుంచి బయటపడిన కొందరు భటులకు శరీరాలన్నీ గాయాలమయంగా తయారైనై.

ఈ భయంకర సంఘటన కళ్ళు మూసి తెరిచేంతలో జరిగిపోయింది. ప్రాణాలతో బయటపడిన కొద్దిమంది భటులతో వ్యాఘ్రదత్తుడు కొంచెందూరం పారిపోయి నిలబడ్డాడు. తనను నమ్మి అనేకమంది భటులు దుర్మరణంపాలు కావటం అతడికి చీమ కుట్టినంత బాధకూడా కలిగించలేదు.

"వ్యాఘ్రేశ్వరికి ఏదో అపచారం జరిగింది! అందువల్లనే అంతమంది భటులూ ఆ సింహద్వారం ముందు బలి అయిపోయారు. ఇక మనకు వచ్చిన భయం లేదు. ధైర్యంగా వుండండి," అంటూ అతడు మిగిలిన ఇరవైమంది భటులకూ ధైర్యవచనాలు పలికాడు.

భటులు కంపించిపోతూ తమ నాయకుడైన వ్యాఘ్రదత్తుడి మాటలకు తలలు వూపారు. అప్పుడు వ్యాఘ్రదత్తుడు తన చేతులోవున్న ఒక పటాన్ని చూపుతూ:



"అపురూప శక్తులు గల శాక్తేయుడి త్రిశూలం వున్నచోటు మీ అందరికీ చెప్పదలిచాను. దాని ప్రభావంవలన మిగిలివున్న మనమే ఈ ప్రపంచానికి రాజాధిరాజులం కావచ్చు. ఆ త్రిశూలం ఉన్నచోటు ఈ పటంలో స్పష్టంగా చూపబడింది. 'ఏనుగుల వనంలోని, విషవృక్షానికి వందగజాల దూరంలో, మృతవీరుల సమాధి క్రింద, గురుద్రోహి అస్థిపంజరంలో శాక్తేయుడి త్రిశూలం దాచబడివుంది," అన్నాడు వ్యాఘ్రదత్తుడు.



చాటున వుండి ఈ మాటలు వింటూన్న సమరసేనుడికి ఆశ్చర్యంతో అంతకన్న భయంతో దేహం వణికిపోయింది. ఏ అపూర్వ శక్తులు గల త్రిశూలంకోసం మంత్రాలదీవిలో ఇన్ని హత్యలూ, యుద్ధాలూ జరుగుతున్నవో, ఆ త్రిశూలం చివరకు వ్యాఘ్రదత్తుడిలాటి పరమదుష్టుడికి లభ్యం కాబోతున్నది!

ఇప్పుడు కర్తవ్యమేమిటి? అన్న ప్రశ్న సమరసేనుణ్ణి బాధించసాగింది.

శివదత్తుడు ఏమయాడు? అతడికి త్రిశూలం ఎక్కడ వున్నదీ తెలుసా? తన దగ్గర వున్న అరుగురు సైనికులతో వ్యాఘ్రదత్తుణ్ణి ఎదుర్కొనటం క్షేమమా, కాదా?

సమరసేనుడు ఎటూ నిర్ణయించుకోలేక పోతున్నాడు. ఒకసారి వ్యాఘ్రదత్తుడిచేతికి ఆ త్రిశూలం చిక్కటంజరిగితే, ఇక అతణ్ణి ఎదిరించటం ఎవరితరమూ కాదు. మంత్రతంత్ర విద్యల్లో సాటిలేనివారిమని భావించే ఏకాక్షీ, చతుర్నేత్రులుకూడా అతడికి దాసోహం అనక తప్పదు. ధనరాసులతో నిండివున్న నావా, దానిని కాపాడుతున్న నాగకన్యాకూడా అతడి వశమైపోక తప్పదు.

ఇలాంటి అపత్సమయంలో తనకు సహాయం చేయగలవాడు ఒక్క చతుర్నేత్రుడుతప్ప ఎవరూలేరు. కాని చతుర్నేత్రుడికి యీ పరిస్థితి తెలియటం ఎట్లా?



నాగకన్యకోసం ప్రయత్నించే అతడికి శాక్తేయుడి శక్తివంతమైన త్రిశూలం సంగతి తెలుసునా, తెలియదా? ఆ త్రిశూలం ఒక్కదాన్ని సంపాయించ గలిగితే— మొత్తం ఈ ద్వీపాన్నే కాక ప్రపంచాన్నే జయించవచ్చు!

సమరసేనుడు ఇలాంటి ఎడతెగని ఆలోచనలలో ఉండగా, వ్యాఘ్రదత్తుడి కంచు కంఠం తిరిగీ మార్మోగింది.

"రేపు మహాపర్వదినం. అమావాస్యా ఆదివారం. కనుక ఈ రాత్రికి ఇక్కడే విశ్రాంతి తీసుకుందాం. రేపు రాత్రి సరిగా ఒంటిగంటకు మనం ఏనుగులవనం ప్రవేశించాలి."

వ్యాఘ్రదత్తుడు భటులకు ఈ విధంగా చెప్పి, అక్కడవున్న ఒక రాతిమీద కూర్చున్నాడు. భటులుకూడా తమ తమ ఆయుధాలు కింద పెట్టి అతడి చుట్టూతా వలయాకారంగా కూర్చున్నారు.

సమరసేనుడికి వ్యాఘ్రదత్తుడి మాటలు కొంత ఆశ కలిగించినై. తనకు యింకా యిరవైనాలుగు గంటల వ్యవధి వున్నది. ఈ కాలంలో తను ఏదోవిధంగా—ఆఖరికి నిద్రిస్తున్న వ్యాఘ్రదత్తుడిమీద పొంచి దూకి అయినా సరే హతమార్చాలి. ప్రస్తుతానికి తనూ, తన సైనికులుకూడా విశ్రాంతి తీసుకోవచ్చు.

ఇలా ఆలోచించి సమరసేనుడు గిరుక్కున వెనక్కు తిరిగాడు. ఆ తిరగటంలో అతను ఆనుకునివున్న సగం విరిగిన రాతిస్తంభం పెద్ద ధ్వనిచేస్తూ కింద పడింది.

ఆ ధ్వని వింటూనే దెబ్బతిన్న బెబ్బులిలా వ్యాఘ్రదత్తుడు లేచి నిలబడ్డాడు అతడితో పాటు భటులుకూడా తమతమ ఆయుధాలతో లేచి నుంచున్నారు. వ్యాఘ్రదత్తుడి దృష్టి సూటిగా సమరసేనుడు దాక్కొని వున్న శిథిలభవనం మీదికే ప్రసరించింది.

—(ఇంకా వుంది)






# వెర్రి ఇవాన్

చాలా కాలం కిందట రష్యాలో ఒక కాపుకు ముగ్గురు కొడుకులుండేవారు. వారిలో ఆఖరు వాడు ఇవాన్. వాడు, పాపం, వెర్రిబాగుల వాడు. అందుచేత వాడికి తల్లి ఏపనీ చెప్పేది కాదు. అయితే అన్నలు పెద్దవాళ్ళయి పనులు చూడటం ప్రారంభించాక, తల్లి ఇవాన్‌ను తనకు చేదోడుగా వాడుకోవటానికి ప్రయత్నించింది.

ఒకనాడు ఉదయం అన్నలిద్దరూ గొర్రెలను బీడుకు తోలుకుపోయారు. తల్లి వాళ్ల కోసరం అట్లు తయారుచేసి వాటిని చట్టిలో పెట్టి, "ఇవి తీసుకుపోయి బీడులో గొర్రెలను కాస్తున్న అన్నలకియ్యి," అని చట్టి ఇవాన్‌కిచ్చింది.

ఇవాన్ చట్టి నెత్తిన పెట్టుకుని బయలుదేరి నడవసాగాడు. వాడు కొంతదూరం పోయి వెనక్కు తిరిగి చూసుకునేసరికి తన నీడ కనిపించింది. ఇవాన్ ఆశ్చర్యపడ్డాడు.

తాను నడిస్తే అది నడిచింది, తాను ఆగితే అదీ ఆగింది.

"ఏయ్, ఎవరు నువు? ఎందుకు నా వెంటపడ్డావ్?" అని ఇవాన్ తన నీడను కోప్పడ్డాడు. కాని నీడ బదులు చెప్పలేదు. ఇంకా వెంబడిస్తూనేఉంది.

"ఓహో! చట్టిలో అట్లున్నాయని తెలుసుకున్నావా? ఇంద, ఒకటి తీసుకు పో," అంటూ ఇవాన్ ఒక అట్టు తీసి నీడమీద పడేసి ముందుకు సాగాడు.

కాని నీడ వెంబడిస్తూనే ఉంది. ఇవాన్ ఇంకో అట్టుతీసి నీడమొహాన కొట్టాడు. నీడ వెంబడిస్తూనే ఉంది. ఇవాన్ ఒక్కొక్క అట్టే దానిమొహాన పారెయ్యసాగాడు. చివరకు కోపంవచ్చి చట్టీ ఎత్తి నీడమీదేసి కొట్టి, 'చావు!' అని తిట్టి వట్టిచేతులతో అన్నల దగ్గిరికి వెళ్ళాడు. వాడు రావడం చూసి "ఎందుకు వచ్చావ్?" అన్నారు వాళ్లు.

డి. స్వరాజ్యలక్ష్మి



"మీకు ఇంటి దగ్గర నుంచి తిండి తెచ్చాను," అన్నాడు ఇవాన్.

"ఏది ?" అన్నారు అన్నలు.

"అమ్మ అట్టువేసి ఇచ్చింది ఈ వెధవ నావెంట పడితే ఒక్కొక్కటే వాడి మొహాన కొట్టాను అన్ని అట్లూ తిన్నా వాడు నన్ను వదలటంలేదు కావలిస్తే చూడండి !" అన్నాడు ఇవాన్. తన నీడను చూపిసూ.

అన్నలిద్దరూ తమ్ముణ్ణి కోపంకొద్దీ చితక గొట్టారు. తల్లి పంపిన ఆహారం నేల పాలయింది గనక తామె సమీపగ్రామానికి వెళ్ళి ఏమన్నా తినిరావాలి. ఈలోపల గొర్రెలను చూసేపని, ఇవాన్‌కు ఒప్పచెప్పాలి.



"మేం ఇప్పుడే తిండి తిని వస్తాం. అందాకా ఈ గొర్రెల్ని కనిపెట్టుండు. నువేమీ చేయనక్కర్లేదు. అవి చెదిరి పోకుండా చూస్తూంటే చాలు," అని అన్నలు వెళ్ళిపోయారు.

అన్నలు వెళ్ళిం తరువాత ఇవాన్ గొర్రెలన్నిటినీ ఒకేచోట ఉంచాలని చాలా ప్రయత్నించాడు. కాని అవి మేస్తూ దేని దారిన అవి పోసాగినై. ఇవాన్ లావుపాటి కర్రతీసుకుని మరీదూరంగా వెళ్ళిన గొర్రెల కాళ్ళు విరగగొట్టసాగాడు. అన్నలు తిరిగి వచ్చి చాలా గొర్రెలకాళ్ళు విరిగి ఉండటం చూచి ఇవాన్‌ను తన్ని ఇంటికి పంపేశారు.

అది మొదలు ఇవాన్‌కు తల్లి ఏపనీ చెప్పేదికాదు. చాలా కాలం గడిచింది. ఇవాన్ పెద్దవాడైనాడు. వాడి తల్లిదండ్రులు పోయారు. కాని ఇవాన్ బుద్ధి కొంచెమైనా పెరగలేదు.

"ఇవాన్ ఎందుకూ పనికిరాడు. వాణ్ణి అమ్మే చెడగొట్టింది. వాణ్ణి కూచోబెట్టి ఎంత కాలమని మనం పనులన్నీ చేస్తాం? వాణ్ణి ఇంటోనుంచి వెళ్ళగొట్టితే అందరూ మనల్ని ఆడిపోసుకుంటారు. వాడికి మనం ఏదో విధంగా పనులుచెయ్యటం నేర్పాలి," అనుకున్నారు అన్నలు.

సూర్పిళ్ల పండగ రాబోతోంది. ఇంట్లోకి బోలెడన్ని సరుకులూ, సామగ్రీ కావాలి. కొనవలసిన సామగ్రి యావత్తూ జాబితా రాసి ఇవాన్‌కిచ్చి, బండిమీద వేయించి తెప్పించటానికి అన్నలు నిర్ణయించారు.

ఇవాన్ బండికి గుర్రాన్ని పూన్చుకుని ఉత్సాహంతో బస్తీకి వెళ్ళాడు. ఒక బస్తా ఉప్పూ, పప్పుదినుసులూ, ఒక నాలుగు కాళ్ళ బల్లా, అనేక కుండలూ, చట్లూ, కప్పులూ సాసర్లూ, ఒకసంచీడు గరిటెలూ, చంచాలూ కొన్నాడు ఇవాన్. వాటన్నిటినీ బండిమోయా వేసుకుని వాడు ఇంటికి బయలుదేరాడు.

కొంతదూరం వెళ్ళాక గుర్రం అలిసిపోయి మెల్లిగా నడవసాగింది.

"ఓహో! బరువు జాస్తయింది. అందుచేత పాపం, గుర్రం లాగలేకుండా ఉంది. కొంత బరువు తగ్గించాలి," అనుకుని ఇవాన్ బండీలో సామానుకేసి పరీక్షగా చూశాడు. వాడి కన్ను నాలుగు కాళ్ల బల్లమీద పడింది.

"దీనికీ గుర్రంలాగే నాలుగు కాళ్ళున్నాయి. కింద దించితే అదే నడిచివస్తుంది. తీపురమా? దీనికి బండీ సవారీ కూడా దేనికి?" అనుకుని ఇవాన్ బల్లను దించి, "త్వరగా ఇంటికి ఏడు!" అని హెచ్చరించి బండిని తోలాడు.






కొంతదూరం పోయాక కొన్ని కాకులు "కా, కా," అని అరుస్తూ బండి వెంబడే ఎగరసాగాయి. వాటికి బండిలో ఉన్న దినుసులు కనబడ్డాయి.

"అయ్యో, పాపం! ఈ కాకులు ఆకలిగా ఉన్నట్టున్నై," అనుకుని ఇవాన్ బండీ ఆపి, మూకుళ్ళూ, సాసర్లూ తీసి వాటినిండా పప్పు ధాన్యాలు పోసి, "కడుపునిండా తినండి!" అని కాకులను హెచ్చరించాడు.

మరి కొంతదూరం పోయాక ఒక చిన్న అడవి వచ్చింది. దారివెంబడే ఇవాన్‌కు కొన్ని కాలిపోయి మొండిగా నిలబడి ఉన్న చెట్లు కనిపించాయి.

"ఛీ, ఛీ! ఈ తమ్ముళ్లకు టోపీలులేవు. చలితో రాత్రిపూట ఎంత బాధ పడుతున్నారో పాపం!" అని ఇవాన్ తానుతెచ్చిన కుండలన్నీ బండిమీదనుంచి దింపి, మోడు చెట్లమీద బోర్లించాడు.

మరి కొంతసేపటికి ఒక వాగు వచ్చింది. ఇవాన్ అందులో తన దాహం తీర్చుకుని గుర్రాన్నికూడా తాగించటానికి ప్రయత్నించాడు. ఎంత బలవంతం చేసినా అది నీరు ముట్టిందికాదు.

"నీరు చప్పగా ఉంటుందని గుర్రం తాగటంలేదు," అనుకుని ఇవాన్ బస్తాడు ఉప్పు వాగులో కుమ్మరించి, "ఇప్పుడు తాగు!" అని గుర్రాన్ని హెచ్చరించాడు. అప్పటికీ గుర్రం నీరు ముట్టకపోవటం చూసి ఇవాన్ మండిపడ్డాడు.

"నీకోసం ఉప్పంతా నీటిలో వేసినా తాగవా? అంత పొగరా నీకు?" అని ఇవాన్ దుడ్డుకర్రతో గుర్రం నెత్తిన రెండు దెబ్బలు కొట్టేసరికి అది కాస్తా చచ్చింది.

ఇంక ఇంటికి పట్టుకుపోవలిసిన సామాను అట్టే లేదు. చంచాలూ, గరిటలూ పెట్టిన సంచీ భుజాన వేసుకుని ఇవాన్ ఇంటిదారి పట్టాడు. వాడు అడుగుతీసి అడుగువేసినప్పుడల్లా సంచీలో సామాను చప్పుడుచెయ్య

సాగింది. ఆ చప్పుడు ఇవాన్ చెవులకు, "పిచ్చి ఇవాన్! వెర్రి ఇవాన్!" అంటున్నట్టుగా వినిపించింది.

ఇవాన్ వెర్రికోపంతో సంచీని కిందపడేసి కసికొద్దీ దాన్ని తొక్కి, "చావండి! చావండి!!" అని శాపనార్థాలుపెట్టి, వొట్టి చేతులతో ఇంటికి చేరుకున్నాడు.

"బండీ ఏది? కొని తెమ్మన్న సామానేది?" అని అన్నలడిగారు.

ఇవాన్ జరిగినదంతా చెప్పాడు. అన్నలు మండిపడి, "పో, వెధవా? చెట్లమీదపెట్టి వచ్చిన కుండలూ, చట్లూ, సాసర్లూ అయినా వెంటనే పోయి పట్టుకురా! లేకపోతే చంపేస్తాం. వెళ్లవేం!" అన్నారు.

ఇవాన్ వచ్చిన దారినే పరిగెత్తి వెళ్లాడు. చట్లకూ, కుండలకూ, సాసర్లకూ బొక్కలు చేసి, వాటిలోనుంచి తాడొకటి దూర్చాడు. వాటన్నిటినీ వీపున వేసుకుని రొప్పుతూ రొజుతూ ఇంటికి తిరిగి వచ్చాడు.

అన్నలు ఆగ్రహం పట్టలేక ఇవాన్‌ను చావచితక బాదిచారు. పండక్కి కావలిసిన సామగ్రి తామే కొనుక్కురావటానికి బయలుదేరారు. ఇవాన్ దిగులుగా ఇంట్లో కూచున్నాడు. కొంతసేపటికి ఎవరో తనను చూసి నవ్వుతున్నట్టు వినిపించింది. వంటింటిలోకి వెళ్లి చూసేసరికి పొయిమీద కుండలో అన్నం కుతకుతలాడుతున్నది.

"ఊరుకోవే! నువుకూడా నన్నేడిపించాలా?" అన్నాడు ఇవాన్.

కుండలో శబ్దం ఇంకా ఎక్కువయింది గాని తగ్గలేదు. ఇవాన్‌కు కోపంవచ్చింది. బండతీసుకుని కుండను ఒక్కపెట్టు పెట్టాడు. కుండ చెక్కలయిపోయింది. అన్నలు సామాను కొనుక్కొని ఇంటికి తిరిగి వచ్చేసరికి అన్నంకూడా లేదు.

ఇవాన్ నిజంగా వెర్రివాడేననీ, వాణ్ణి బాగుచెయ్యటం అసంభవమనీ గ్రహించి అన్నలు ఏదోవిధంగా వాణ్ణిపోషించసాగారు.





# దేవరకోటి

నాలుగువందల పైచిల్లర సంవత్సరాల క్రితం శ్రీకృష్ణదేవరాయలు దక్షిణదేశాన్ని వైభవంగా పాలించాడు. ఆయన ఆస్థానంలో గొప్ప గొప్ప కవులూ, పండితులూ ఉండేవారు. రోజూ ఏదో ఒక చర్చ జరుగుతూండేది.

ఒకనాడు పండితుల మధ్య ఒక సందేహం వచ్చింది. అదేమిటంటే :— ధర్మరాజుకు భీమార్జున నకుల సహదేవులు నలుగురు తమ్ములు. శ్రీరామచంద్రుడికి లక్ష్మణ భరత శత్రుఘ్నులు ముగ్గురు తమ్ములు. ధర్మరాజు తమ్ములు తమ అన్నగారిపట్ల ఎంతో భక్తి శ్రద్ధలు కనబరిచారు. ఆయనతోబాటు రాజ్యభ్రష్టులైనారు, అరణ్యవాసం, అజ్ఞాతవాసం చేశారు. అలాగే శ్రీరాముడి తమ్ములుకూడా అన్నపట్ల ఎంతో భక్తిశ్రద్ధలు కనబరిచారు. లక్ష్మణుడు అన్నవెంట పద్నాలుగేళ్ళు అరణ్యవాసం చేసి రాత్రింబగళ్ళు కన్ను మూయలేదు. భరతుడు కోసలదేశానికి రాజైకూడా సింహాసనంమీద తన అన్నగారి పాదుకలుంచాడుగాని తాను కూచోనేలేదు. ఇప్పుడు సమస్య ఏమంటే, ధర్మరాజు తమ్ముల భక్తిశ్రద్ధలు గొప్పవా, రాముడి తమ్ముల భక్తిశ్రద్ధలు గొప్పవా ?

సభలో కొందరు ధర్మరాజు తమ్ముల పక్షం వాదించారు. మరి కొందరు రాముడి తమ్ముల పక్షం వాదించారు. వాదన ఎంతకీ తెగలేదు. చివరకా పండితులు శ్రీకృష్ణదేవరాయలవారిని చెప్పమని కోరారు. రాయలవా రీవిధంగా తీర్పుచెప్పారు :

"శ్రీరాముడి తమ్ములు శ్రీరాముడికన్న ఏవిధంగానూ యెక్కువైనవారు కారు. అన్నింటికీ అన్నమీద ఆధారపడినవారు. ధర్మరాజు తమ్ములు అలాకాదు. వారు అనేకవిధాల అన్నను మించినవారై ఉండి-

జె. సుబ్రహ్మణ్యశర్మ

కూడా ఆయనకోసం సమస్తత్యాగాలూ చేసి, అష్టకష్టాలూ పడ్డారు. అందుచేత ధర్మరాజు తమ్ముల భక్తిశ్రద్ధలే ఎక్కువైనవి."

ఈ మాటలకు సభలో పండితులు చాలా సంతోషించారు. ఇదంతా వింటూ రాయల వారికి వింజామరలు వీస్తున్న చాకలివాడు, "ఈ అవతారంలోకూడా దేవరకు పాండ వులమీద పక్షపాతమే!" అన్నాడు. శ్రీ కృష్ణ దేవరాయలు భారతంలో కృష్ణుడి అపరావ తారమని వాడి తాత్పర్యం.

రాయలవారు చాకలి చమత్కారానికి చాలా సంతోషించి, తన మంత్రి తిమ్మ రుసుతో, "మన చాకలికి ఏంకావాలో కనుక్కొని ఇప్పించండి," అన్నాడు.

వెంటనే చాకలి, "నాకు మరేమీ వద్దు. దేవరకోట ఇప్పించండి!"అన్నాడు.

తిమ్మరుసు నిర్ఘాంతపోయాడు. చాక లిని ఏకాంతంగా పిలిచి, "ఒరే, ఇంకేమైనా కోరుకో. తప్పక ఇప్పిస్తాను," అన్నాడు.

చాకలి వినయంగా, "నాకింకేమీ కోరిక లేదు, దొరా," అన్నాడు.

కొద్దిరోజులు గడిచాయి. ఒకరోజు కొందరు కృష్ణాతీరవాసులు దివాణానికి ఏదో పనిమీద వచ్చారు. తిమ్మరుసు వారిలో ఒక మనిషి 'దేవరకోట' అనే గ్రామంనుంచి వచ్చినట్టు తెలుసుకున్నాడు.

"దేవరకోటా? ఎక్కడ ఉన్నదీ గ్రామం?" అని అడిగాడు తిమ్మరుసు.

"కృష్ణానదికి ఉత్తరాన ఒక కుగ్రామం," అని ఆ మనిషి జవాబుచెప్పాడు.

వెంటనే తిమ్మరుసు చాకలిని పిలిచి "ఒరే, నీకు దేవరకోట ఇచ్చేశాం. బయలు దేరివెళ్ళు. అది కృష్ణానదికి అవతలఉన్నది. ఇదుగో ఫర్మానా!" అన్నాడు.

చాకలి నిర్ఘాంతపోయాడు. రాయలవారి కోట తన కిస్తారని ఆశపడ్డాడు. ఆ ఆశ నిరాశ అయింది. పైగా వాడికి ఆస్థానంలో ఉండే యోగ్యతకూడా లేకుండాపోయింది.





# నిజాయితీ

ఒకప్పుడు విదర్భదేశంలో దొంగతనాలూ, దోపిడీలూ చాలా హెచ్చుగా ఉండేవి. ఆ దేశపురాజు యువకుడు. తన పరిపాలనలో ఇలాటి అక్రమాలు జరుగుతూన్నందుకు చాలా విచారించాడు. రాజభటులూ, రక్షక భటులూ, తలారులూ, దండనాయకులూ ఎందరో ఉండికూడా దొంగలను పట్టుకోవ టానికి అశక్తులుగా కనిపించారు.

దొంగలను తీవ్రంగా దండించినట్టయితే దొంగతనాలు అరికట్టవచ్చునని రాజుకు తోచింది. పట్టుబడిన ప్రతి దొంగనూ కొరత వేయవలసిందిగా రాజు ఉత్తరువు చేశాడు. అతి చిన్న దొంగతనాలు చేసిన వారిని కూడా నిర్దాక్షిణ్యంగా కొరత వేయసాగారు.

అయితే ఇందువల్ల దొంగతనాలు తగ్గక పోగా హెచ్చసాగాయి. ఇందులో గల రహస్యం ఏమిటో తెలుసుకుందామని రాజు పరదేశీ ప్రయాణీకుడిలాగా వేషం వేసుకుని ఒకనాటి అర్ధరాత్రి రాజనగరునుంచి బయలుదేరి తెల్లవారేసరికి అయిదు కోసుల దూరంలో ఉన్న ఒక పల్లె చేరాడు. రాజు రచ్చబండవద్దకు వచ్చేసరికి అక్కడ ఊరి పెద్దలు కొందరు కనిపించారు. ఆయన కూడా అక్కడే కూచుని, "మీదేశంలో దోపిడీలూ, దొంగతనాలూ చాలా ఎక్కువని విన్నాను. పాపం, మీరంతా ఎలా బ్రతుకు తున్నారు?" అని అడిగాడు.

"ఉన్నవారికి దొంగల భయంగాని మాకే ముంది, నాయనా? దివాణంవారు మమ్మల్ని ఏనాడో దోచేశారు," అన్నాడొక వృద్ధుడు.

"రోజూ దొంగతనాలు జరిగినా ఒక్క దొంగా చిక్కడుట. ఏమిటీ వింత? మీ దేశపు దొంగలు చాలా నేర్పరుల్లే ఉన్నారే?" అన్నాడు రాజు.

"పెద్ద దొంగలను దివాణం కాపాడు తుంది. చిన్న దొంగలను ప్రజలు కాపాడ

కొత్తపల్లి సుబ్బారావు

తారు. దొంగలు చిక్కకపోవటాని కింతకన్న కారణం ఏమీలేదు," అన్నాడు వృద్ధుడు.

"చిన్న దొంగలంటే ప్రజల కెందుకు అభిమానం?" అని రాజు అడిగాడు.

"వాళ్ళు పెద్ద దొంగలలాగా నీతిమాలిన వాళ్ళు కారు. చిన్న దొంగలు నిజాయితీ పరులు," అన్నాడు వృద్ధుడు.

రాజు అక్కడినుండి కదిలి మరొక గ్రామానికి వెళ్ళాడు. ఆ గ్రామంలో ఏపనీ చెయ్యకుండా నిర్విచారంగా కాలం గడిపే వాళ్ళెవరైనా ఉన్నారా అని విచారించాడు. ఒక్క మనిషి ఉన్నట్టు తెలిసింది. రాజు ఆ మనిషి ఇంటికి వెళ్ళి, "అయ్యా, నేను పరదేశీని. ఈ దేశంలో న్యాయంగా దొంగ తనం చేసుకుని జీవింతామని వచ్చాను. సహాయం చెయ్యగలరా?" అని అడిగాడు.

"నేను దొంగనని ఎలా కనిపెట్టావు?" అని ఆ మనిషి అడిగాడు.

"నేను కూడా దొంగనేగనక మరొక దొంగను పోల్చగలను," అన్నాడు రాజు.

"భేష్! నీవు నీతినియమాలు పాటించి నట్టయితే పైకి వస్తావు," అన్నాడు దొంగ.

"మీవెంట నన్ను ఒక్కసారి దొంగ తనానికి రానివ్వండి. ఆతరవాత నా బ్రతుకు నేను చూసుకుంటాను," అన్నాడు రాజు.




"అయితే ఈ రాత్రి రాజుగారి ధనా గారానికి కన్నంవేద్దాం," అన్నాడు దొంగ.

"అది ప్రమాదకరం కాదా? ఏ చిన్న ఇంటికో, కన్నంవేయటం క్షేమం అను కుంటాను," అన్నాడు రాజు.

"ఛీ, ఛీ! నువ్వెక్కడో పెద్ద దొంగలా మాట్లాడుతున్నావు. మనం చిన్న దొంగలం. ఆ సంగతి మరవకు. మనం పెద్దఇళ్ళే దోస్తాం," అన్నాడు దొంగ.

ఆ రాత్రి పొద్దుకగానే ఇద్దరూ బయలు దేరి అర్ధరాత్రికల్లా రాచనగరు చేరారు.

"అయ్యా, ఈ దొంగతనంలో నాకెంత భాగం?" అని అడిగాడు రాజు.



"ఇద్దరికీ చెరిసగం," అన్నాడు దొంగ.

"నాకన్న అనుభవం గలవారు గదా? మీరు హెచ్చు తీసుకోవటం న్యాయం కదా?" అన్నాడు రాజు.

"కాదు. మనం పట్టుబడితే ఇద్దరికీ సమానమైన శిక్షే వేస్తారు. అందుచేత దొంగిలించిన సొమ్ము సమంగా పంచుకోవటమే న్యాయం," అన్నాడు దొంగ.

దొంగయొక్క న్యాయబుద్ధికి ఆశ్చర్యపోతూ రాజు, "మీ మాట నమ్మవచ్చునా?" అని అడిగాడు.

"నేను అబద్ధం ఆడలేను. అబద్ధాన్ని గురుదక్షిణగా ఇచ్చేశాను," అన్నాడు దొంగ.

ఎవరి కంటా పడకుండా దొంగ రాజును ధనాగారానికి చేర్చాడు. ఇద్దరూ లోపలికి వెళ్ళారు. ఒక బంగారుభరిణలో మూడు పెద్ద వజ్రాలున్నాయి.

"మూడు వజ్రాలను ఇద్దరం సమంగా పంచుకోలేం. అందుచేత చెరొకటీ తీసుకుని మూడవది ఇక్కడే ఉంచేద్దాం. ఈ ఒక్క వజ్రాన్నీ మీ దేశంలో అమ్ముకున్నావంటే బతికినన్నాళ్ళూ నీకు సుఖంగా వెళ్లిపోతుంది," అన్నాడు దొంగ. ఇంకే వస్తువూ ముట్టకుండా వారు బయటికి వచ్చేశారు.

రాజు దొంగవద్ద సెలవుపుచ్చుకుని తన భవనానికి వచ్చేశాడు.



తెల్లవారుజామున పహరావాళ్ళు, ధనాగారానికి వేసిన కన్నం గమనించి, మంత్రికి కబురు చేశారు. మంత్రి వచ్చి రెండు వజ్రాలు మాత్రమే పోయినట్టు గ్రహించి, మూడవది జేబులో వేసుకుని, రాజుతో మూడు వజ్రాలూ పోయినవని చెప్పాడు.

ఫలాని గ్రామంలో ఫలాని మనిషిని పట్టి తెప్పిస్తే దొంగతనం బయటపడుతుందని రాజు మంత్రితో చెప్పాడు. రాజభటులు వెళ్ళి దొంగను పట్టితెచ్చారు.

"అయ్యా, నేనూ మరొక దొంగా కలిసి క్రిందటిరాత్రి రాజుగారి ధనాగారంలోనుంచి రెండు వజ్రాలు దొంగిలించి చెరొకటీ తీసుకున్నాము. మూడవది మేము ముట్టనేలేదు. ఇదుగో నేను తీసుకున్న వజ్రం," అంటూ దొంగ ఒక వజ్రం తీసి ఇచ్చాడు.

"వీడే మిగిలిన రెండూ ఎక్కడో దాచి ఉంటాడు. వీణ్ణి కొరతవేయించండి, మహాప్రభూ!" అన్నాడు మంత్రి.

"తొందరపడకండి. వీడితో కలిసి దొంగతనం చేసిన దొంగను నేను పట్టుకున్నాను. వాడుకూడా ఇలాగే చెప్పి తాను పుచ్చుకున్న వజ్రం నాకిచ్చాడు. ఇదుగో ఆ వజ్రం!" అంటూ రాజు తన జేబులోనుంచి రెండవ వజ్రం బయటికి తీశాడు.

"అయితే మూడవ వజ్రం తీసినవాణ్ణి పట్టుకోవాలి. నాకొక మాసం గడువివ్వండి!" అన్నాడు మంత్రి.

"ఈ భాగ్యానికి మాసం గడువెందుకు? మూడోవజ్రం మీ జేబులోనే ఉండవచ్చు. చూడండి," అన్నాడు రాజు.

మంత్రి వణుకుతున్న చేతులతో తన జేబులో ఉన్న మూడవ వజ్రం పైకి తీశాడు.

రాజు మంత్రిని కొరతవేయించి, మంత్రి స్థానంలో దొంగను నియమించాడు. దివాణంలో "పెద్ద" దొంగలందరూ మారిపోయారు. ప్రజల జీవితం బాగుపడింది. దానితో చిన్న దొంగలూ లేకుండాపోయారు.





# యుక్తిగల అబద్ధం

ఒకప్పుడు కాశీరాజ్యాన్ని యశోవర్ధనుడనే రాజు పరిపాలించాడు. ఆ సమయంలో కాశీరాజ్యంలో వాణిజ్యం అభివృద్ధి అవుతున్నది. చుట్టుపక్కల రాజ్యాలలో మతాంతరుల పరిపాలనలు ఏర్పడుతున్నాయి. తలవనితలంపుగా యుద్ధాలు సంప్రాప్తమయితే ఇతర రాజ్యాల సాయం కావాలి. వాణిజ్యంవల్ల కాశీవర్తకులు బాగుపడాలంటే ఇతర దేశాలతో అనుకూలమైన వర్తక ఒడంబడికలు జరగాలి. వీటన్నిటినీ సాధించటానికి రాజకీయ చతురత గల రాయబారుల దళం ఏర్పరచుకోవాలి. సమయోచితంగా అబద్ధాలాడి అవతలివాడిని ఇరుకున పెట్టగలవాడే రాయబారిగా పనికివస్తాడుగాని కుండపగలేసి నిజంచెప్పేవాడు బొత్తిగా పనికిరాడు.

రాయబారులుగా పనికివచ్చేవారు దేశంలో ఎందరున్నారో తెలుసుకోవటానికి యశోవర్ధను డొక ఉపాయం ఆలోచించాడు. ఒకనాడు తన కొలువులో సభికుల మధ్య అబద్ధాల పోటీ ఏర్పాటుచేస్తున్నట్టు ప్రకటిస్తూ, "అందరికన్న యుక్తిగా అబద్ధం ఆడినవాడికి నా కుమార్తెనిచ్చి పెళ్ళిచేస్తూ, అర్ధరాజ్యం ఇస్తాను," అన్నాడు రాజు.

సభికులంతా నిర్ఘాంతపోయి ఒకరి ముఖా లొకరు చూసుకున్నారు. రాజకుమార్తెతోబాటు అర్ధరాజ్యం సంపాదించాలనే ఆశ చాలామందికి కలిగింది.

ఒక వ్యక్తి లేచి, "మహారాజా, నా చిన్నతనంలో ఒకేసారి తూర్పున సూర్యోదయమూ, పడమట పూర్ణచంద్రోదయమూ కావటం నేను చూశాను," అన్నాడు.

"చిన్నతనంవల్ల తూర్పును పడమర అనీ పడమర తూర్పనీ పొరపడివుంటావు. అలాగే అస్తమయ కాలాన్ని ఉదయకాలమని భ్రమపడివుంటావు," అన్నాడు రాజు.

'చిట్టిబాబు'

మరొక వ్యక్తి లేచి, "మహాప్రభూ! మా ఊళ్లో కొందరు వేసవికాలంలో ఎండవేడిని పాత్రలలో నింపి వానాకాలంలో దానితో వంట చేసుకుంటారు," అన్నాడు.

"అందువల్ల వారు వంటచెరుకు ఆదా చేసుకుంటారు కాబోలు," అన్నాడు రాజు.

ఇంకొక వ్యక్తి లేచి, "మహారాజా, మా ఊళ్ళో కొందరు తల కిందికిపెట్టి నడుస్తారు, నోటితో వింటారు, ముక్కుతో చూస్తారు, చెవులతో తింటారు," అన్నాడు.

"అందువల్ల వారి జీవితాలలో కలిగిన మార్పేమిటి?" అన్నాడు రాజు. ఆ వ్యక్తి సమాధానం చెప్పలేకపోయాడు.

ఈవిధంగా ఎందరో అబద్ధాలాడారు. వాటిల్లో యుక్తి కొంచెమైనా లేదు. వీరిని రాయబారులుగా పంపితే కాశీరాజ్యం నవ్వులపాలు కావటంతప్ప మరేమీ జరగదు.

రాజు ఇలా అనుకుంటుండగా ఒక వ్యక్తి లేచినిలబడ్డాడు. "మహారాజా, నా పిత్రార్జితమైన రాజ్యాన్ని మీరు అక్రమంగా స్వాధీనపరుచుకోవటమే గాక ఇలాటి పచ్చి అబద్ధాలాడేవారికి ఇందులో సగమిచ్చి అన్యాక్రాంతం చెయ్యాలనికూడా చూస్తున్నారు" అని ఆ వ్యక్తి కూచున్నాడు.

క్షణంపాటు రాజు నివ్వెరపోయాడు. నిండుసభలో ఈ వ్యక్తి కాశీరాజ్యం తన పిత్రార్జితమన్నాడు. అది నిజమని ఒప్పుకునే మాటైతే రాజ్యమంతా ఆ వ్యక్తికి ఇచ్చెయ్యాలి. అబద్ధమనే మాటైతే, ఈ అబద్ధం వల్ల తనను ఆ వ్యక్తి ఇరుకున పెట్టినట్టు రాజు ఒప్పుకుతీరాలి. ఇదే యుక్తిగలఅబద్ధం!

రాజు లేచి, "భేష్! నీ అబద్ధానికి మేం చాలా సంతోషించాం. నీకు త్వరలోనే మా కుమార్తెనిచ్చి వివాహంచేసి అర్ధరాజ్యం అప్పజెప్పుతాం!" అని ప్రకటించాడు.

తరువాత ఆ వ్యక్తి కాశీరాజుకు అల్లుడై, రాయబారకార్యాలలో ఘనవిజయాలు సాధించాడు.






కవిత్వమంటే చెవికోసుకునే భోజరాజు పరిపాలనలో కవిపండితులకు తప్ప మరెవరికీ రాజాదరణ లభించేదికాదు. వేద వేదాంగాలు వల్లెవేసినవారికికూడా తిండి దొరకని పరిస్థితి ఏర్పడింది. అందుచేత కొందరు వేదాధ్యయనపరులైన ఛాందస బ్రాహ్మణులు, ఎలాగైనా ఒక శ్లోకం అల్లి, భోజరాజుకు నివేదించి, కొంత బహుమానం సంపాదించి పొట్టపోసుకుందామని నిశ్చయించుకున్నారు. ఎందుకంటే భోజరాజు దగ్గిరికి యాచనకు వెళ్ళినా కవిత్వంతోనే యాచించాలి.

ఒకరోజున ఆ బ్రాహ్మణులు ధారా నగరంలోని భువనేశ్వరీ ఆలయానికి వెళ్ళి శ్లోకం అల్లటానికి కూచున్నారు. పంక్తికి ఎనిమిదేసి అక్షరాల చొప్పున నాలుగు పంక్తులు అల్లగలిగితే ఒక శ్లోకమవుతుంది. ఆ సంగతి వాళ్లకు తెలుసు. కాని విషయం ఎంత ఆలోచించినా తట్టలేదు. వాళ్ళని బాధిస్తున్నదల్లా ఒకటే సమస్య. అది భోజనంసమస్య.

"భోజనం దేహి రాజేంద్ర" అని అడుగుదామన్నాడు ఒక బ్రాహ్మణుడు. "భేష్, బాగుంది" అన్నారు మిగిలినవాళ్ళు. శ్లోకంలో ఒక పాదం పూర్తి అయింది కూడానూ.

ఇంకా మూడు పాదాలు పూర్తికావాలి.

"రాజుగార్ని భోజనం పెట్టమని అడిగేటప్పుడు, నెయ్యీ పప్పూవేసి పెట్టమనటం ఉచితంగా ఉంటుందికదా. 'ఘృతసూప సమన్వితం' అని చేర్చుదాం," అన్నాడు ఇంకో బ్రాహ్మణుడు.

"భేష్! చాలా బాగుంది," అన్నారు మిగతావాళ్ళు.

'భోజనం దేహి రాజేంద్ర
ఘృత సూప సమన్వితం'

ఎస్. సుబ్బరామయ్య

సగం శ్లోకం అయిపోయింది. ఇంకా సగం ఉంది. కాని, పాపం, బ్రాహ్మణులకు ఇంకేమడగాలో తెలియలేదు. వాళ్లు రాజు గారిని అడగదలిచిన పప్పుకూడు రెండు పాదాల్లోనే అడిగేశారు. ఇంకా మిగిలివున్న రెండు పాదాలు ఎలా పూర్తిచేయాలి? అందులో రాజును ఏమడిగేట్టు?

ఈ సమస్య తేలక బ్రాహ్మణులు తికమక పడుతున్న సమయంలో మహాకవి కాళి దాసు అక్కడికి వచ్చాడు. శ్లోక పాదాలు రెండు కుదిరి మరి రెండు కుదరక నానా అగచాట్లూ పడే బ్రాహ్మణులను చూశాడు. కాళిదాసుకు వాళ్ళను చూస్తే జాలివేసింది. వాళ్ళు అల్లిన కవిత్వానికి భోజుడు కానీ కూడా ఇవ్వడు.

"అయ్యా, మీ కభ్యంతరం లేకపోతే మిగిలిన శ్లోకపాదాలు నేను పూర్తిచేస్తాను. పూర్తి శ్లోకం భోజరాజుకు సమర్పించి ఏమైనా దొరికితే పుచ్చుకోండి," అన్నాడు కాళిదాసు.

"అంతకంటేనా, బాబూ! సమయానికి నీవు దేవుడల్లే ఇక్కడికి వచ్చావు. మిగిలిన రెండు పాదాలూ రాసిపెట్టు. నీ మేలు చెప్పుకుంటాం," అన్నారు బ్రాహ్మణులు.

"భోజరాజును మీరు నెయ్యి పప్పులతో సహా భోజనం అడగనే అడిగారు. శరత్కా



లపు చంద్రుని వెన్నెలవలె తెల్లనైన గేదె పెరుగుతోకూడా భోజనం పెట్టమని అడగండి!" అన్నాడు కాళిదాసు.

బ్రాహ్మణులు గేదెపెరుగు మాట చెవిని పడగానే పరమానందభరితులై, "ఏదీ? ఎలా?" అన్నారు ఆత్రంగా.

"మాహిషంచ శరచ్చంద్ర
చంద్రికా ధవళం దధి" — అని

కాళిదాసు వారి శ్లోకాన్ని పూర్తిచేశాడు. అందులో గల కవిత్వం వారికి అర్థంకాక పోయినా, శ్లోకం పూర్తిఅయి, తమ పని ముగిసిందన్న సంతోషంలో ఆ బ్రాహ్మణులు కాళిదాసుకు ధన్యవాదాలు తెలిపి అక్కడి నించి వెళ్ళిపోయారు.

వారు మర్నాడు రాజసభకు వెళ్లారు. అతి కష్టంమీద రాజదర్శనం లభించింది. ఆ సమయంలో భోజరాజు కవిపండితులమధ్య సుఖాసీనుడై వున్నాడు. మంత్రిసామంతులతో, ప్రజలతో సభ క్రిక్కిరిసి వున్నది.

పండితులు భోజరాజుకు ఎదురుగా నిలబడి కంఠస్థం చేసిన శ్లోకం—

భోజనం దేహి రాజేంద్ర
ఘృత సూప సమన్వితం
మాహిషంచ శరచ్చంద్ర
చంద్రికా ధవళం దధి

అని చదివారు.

ఈ శ్లోకం వింటూనే భోజరాజు, "ఈ శ్లోకం మొదటి రెండు పాదాలు రాసిన వారికి కవిత్వం రాదు. అయితే మిగిలిన రెండు పాదాలు రాసినది కాళిదాసు తప్ప మరొకరై ఉండరు! ఆ రెండు పాదాలకూ అక్షరలక్ష ఇచ్చి ఈ ఛాందసపు బ్రాహ్మణులను పంపివెయ్యండి!" అన్నాడు.

బ్రాహ్మణులు నిర్ఘాంతపోయి సభ చుట్టూ కలయచూసేసరికి వారికి కాళిదాసు కనిపించాడు. ఆయనే తమకు భిక్షపెట్టాడని తెలుసుకుని, దొరికిన సొమ్ము తీసుకుని తమ దారిన వెళ్లిపోయారు.






పూర్వం ఉజ్జయినీ నగరంలో యశస్కరుడనే బ్రాహ్మణుడుండేవాడు. అయన కుమారుడు శశిభూషణుడనేవాడు చాలా అందగాడు, మంచివాడుకూడా. అతడికి గురువు దగ్గిర విద్య అభ్యసిస్తూండగా విజయసేనుడనే క్షత్రియబాలుడితో స్నేహమయింది.

ఒకనాడు విజయసేనుడి వెంట అతని చెల్లెలు మదిరావతి అనే పిల్ల గురువుగారింటికి వచ్చింది. మదిరావతికూడా అసాధారణ సౌందర్యవతి. ఆమెను చూసినది మొదలు శశిభూషణుడికి ఆమెమీద అంతులేని ప్రేమ కలిగింది.

మదిరావతి ఇంటికి వెళ్ళి తన తల్లితో శశిభూషణుణ్ణిగురించి చాలా గొప్పగా చెప్పింది. శశిభూషణుణ్ణి ఒకసారి విలుచుకురమ్మని తల్లి విజయసేనుడితో అన్నది.

మర్నాడు విజయసేనుడు తన స్నేహితుడైన శశిభూషణుణ్ణి వెంట బెట్టుకుని వెళ్ళాడు. విజయసేనుడు తండ్రితో ఏదో మాట్లాడుతూవుండగా ధాత్రేయి అనే అమ్మాయి, మదిరావతి స్నేహితురాలు, ఒంటరిగా వున్న శశిభూషణుడివద్దకు వచ్చి, అతనికి మాలతీపూలదండ ఇచ్చి, "దీనిని నా సఖి మదిరావతి ఎవరికీ తెలియకుండా నీకోసం అల్లింది. తీసుకో!" అన్నది.

"నీ సఖికి కావలిస్తే నా ప్రాణాలైనా ఇస్తానని చెప్పు," అన్నాడు శశిభూషణుడు.

అదిమొదలు శశిభూషణుడూ, మదిరావతీ తరుచు మాట్లాడుకుంటూండేవారు. నానాటికీ వారి ప్రేమ పెరగసాగింది.

ఇంతలో ఒకనాడు ఒక క్షత్రియకుమారుడు వచ్చి, మదిరావతిని తనకిచ్చి వివాహం చెయ్యవలసిందని ఆమె తండ్రిని కోరాడు. తన కుమార్తె మరొకరిని ప్రేమిస్తున్నదని తెలియక తండ్రి అంగీకరించాడు. లగ్నంకూడా నిశ్చయమైపోయింది.

బి. రామనారాయణ



శశిభూషణుడు, ఈ బాధ భరించేకన్న ఆత్మహత్య చేసుకోవటం నయమనుకున్నాడు. పెళ్లిపీటలమీద కూచునేముందు మదిరావతి తోడుపెళ్లికూతుళ్ళతోసహా ఊరి వెలపల ఉన్న అమ్మవారి గుడికి వచ్చి అక్కడవుండే కామదేవుడికి పూజచేస్తుంది. ఆ గుడికి సమీపంగా దారిలో ఒక మఱ్ఱి చెట్టున్నది. ఆ చెట్టుకొమ్మకు ఉరివేసుకున్నట్టయితే మదిరావతి కనీసం తన శవాన్నయినా చూడగలుగుతుందనే ఉద్దేశంతో శశిభూషణుడు అక్కడికి బయలుదేరాడు.

ఈలోపల మదిరావతి స్నేహితురాలు ధాత్రేయి ఆ ఉదయమే శంఖహ్రదమనే కోనేటికి స్నానం చేయబోయింది. ఆ కోనేటి ఒడ్డున ఆమె పూలు కోస్తూండగా, ఆమెకు సోమదత్తుడనే బ్రాహ్మణ యువకుడొకడు కనిపించాడు.

ఆ బ్రాహ్మణ యువకుడు పూలు కోస్తూన్న తనవంక కన్నార్పకుండా చూస్తూ వుండటం గమనించి ధాత్రేయి సిగ్గుపడింది.

ఈ సమయంలో దూరాన కలకలం వినబడింది. గొలుసులు తెంచుకున్న మదపుటేనుగు ఒకటి వారున్న వైపే వాయువేగంతో వస్తోంది. ఏమిచెయ్యాలా అని ధాత్రేయి ఆలోచించేలోపుగా, పరదేశీ అయినా ఆ

మదిరావతి వివాహం నిశ్చయమైన క్షణంనుంచీ శశిభూషణుడికి మనోవ్యాధి పట్టుకున్నది. కనీసం ఒక్కసారి మదిరావతిని కళ్లారాచూసి తన మనోవేదనకు కొంత ఉపశాంతి చేసుకుందామన్నా వీలు పడిందికాదు.

పెళ్ళిరోజు వచ్చింది. మదిరావతికి తలంటి పెళ్లికూతుర్నిచేశారు. మంగళ వాద్యాలతోసహా పెళ్లికొడుకు వచ్చాడు.

ఏవిధంగానైనా మదిరావతి పెళ్ళి తప్పిపోతుందేమోనన్న ఆశ అంతవరకూ శశిభూషణుడి మనస్సులో ఉంటూవచ్చింది. అది కాస్తా ఇప్పుడు అడుగంటింది.

సోమదత్తుడు ఆమెను తన చేతులలో ఎత్తుకుని పారిపోయి, దూరాన ఉన్న జనందగ్గిర ఆమెను చేర్చాడు.

అంత ధైర్యసాహసాలతో తనను కాపాడిన ఆ యువకుడి పూర్వోత్తరాలు ధాత్రేయి తెలుసుకునేలోపునే ఆ మదపుటేనుగు జనంమీదికి వచ్చింది. ఎక్కడి వారక్కడ చెల్లాచెదరుగా పారిపోయినారు. సోమదత్తుడుకూడా పారిపోయినాడు. అతను ధాత్రేయిని కలుసుకుని ఆమె సమాచారం తెలుసుకుందామని తిరిగి అక్కడికి వచ్చేసరికి ఆమె కనబడలేదు. తన ప్రియసఖి మదిరావతి లగ్నముహూర్తం దగ్గిర పడటం మూలాన ఆమె సోమదత్తుడి విషయం విచారించే అవకాశం లేకపోయింది.

తాను రక్షించిన పిల్ల ఎవరో, ఆమె పేరేమిటో సోమదత్తుడికి తెలియదు. ఆమె కనబడినదాకా విశ్రమించరాదని అతను నిశ్చయించుకుని బయలుదేరి, చాలాదూరం నడిచాడు. అతనావిధంగా నడుస్తూ అమ్మవారి ఆలయప్రాంతానికి వచ్చేసరికి దారిపక్క మర్రిచెట్టునుండి వేలాడుతూ ఒక యువకుడి శరీరం సోమదత్తుడి కంటపడింది. సోమదత్తుడు వెంటనే దగ్గిరికి వెళ్ళి ఆ శరీరాన్ని కిందకు దించి చూశాడు. ఉరివేసుకున్న శశిభూషణుడు స్పృహతప్పి ఉన్నాడు





గాని, చావలేదు. సోమదత్తు డతనికి ఉపచారాలు చేయసాగాడు.

కొద్దిసేపట్లో శశిభూషణుడికి స్పృహ కలిగింది. అతను లేచికూచుని సోమదత్తుణ్ణి చూసి, "నా ప్రాణం కాపాడిన దయామయుడివి, ఎవరు నాయనా నీవు? నన్నెందుకు బతికించావు? నా జీవితం నిరర్థకమైనది" అంటూ తన కథ చెప్పాడు.

అంతా విని సోమదత్తుడు, "వెర్రివాడా, ఇదేనా పురుషకారం? నేనూ నీలాగే ఒక కన్యను ప్రేమించాను. ఆమె ఎవరో తెలియకుండానే ఆమెకోసం వెతుకుతున్నాను," అంటూ తన కథ చెప్పాడు.



వీరీవిధంగా మాట్లాడుకుంటూండగానే దూరాన మంగళవాద్యాలు వినపడ్డాయి.

"అదుగో, మదిరావతి కామదేవుణ్ణి పూజించటానికి వస్తోంది," అన్నాడు శశిభూషణుడు.

"అయితే మనం గుడిలో విగ్రహాలవెనక దాక్కుందాం," అన్నాడు సోమదత్తుడు.

ఇద్దరూ విగ్రహాలవెనక దాగిన కొద్దిసేపటికి మదిరావతి తన చెలికత్తెలతోసహా గుడి చేరింది. మిగిలినవారి నందరినీ బయటనే ఉంచి ఆమె ఒంటరిగా గర్భగుడిలోకి వచ్చి, తలుపుమూసి గడియపెట్టి, "ఓ కామదేవా! నేను ఒకరిని ప్రేమిస్తే నన్ను మరొకరికెందుకిచ్చి పెళ్లిచేస్తున్నావు? నా కోరిక యీ జన్మలో తీరనిపక్షంలో త్వరలో మరొక జన్మలోనైనా శశిభూషణుడి భార్య అయేలాగు అనుగ్రహించు, తండ్రీ!" అని ప్రార్థించి, తన పల్లెవాటు కంఠానికి చుట్టి ఉరి వేసుకోబోయింది.

ఈ సమయంలో శశిభూషణుడు విగ్రహం చాటునుండి పరిగెత్తుకుంటూ వచ్చి ఆమెను వారించాడు.

సోమదత్తుడుకూడా ఇవతలికి వచ్చాడు.

"మాటలకు వ్యవధిలేదు. కనుచీకటి పడింది. నీ ప్రియురాలికి నా దుస్తులు



కట్టించి ఆమెను వెంటపెట్టుకుని గ్రామాంత రానికి బయలుదేరు. ఈలోగా నే నీమె దుస్తులు ధరించి బయటికి పోతాను," అన్నాడు సోమదత్తుడు.

సోమదత్తుడు మదిరావతి పెళ్ళిబట్టలు ధరించి, ముఖం కనబడకుండా వల్లె మేలి ముసుగు వేసుకున్నాడు. తలుపు తెరిచి బయటికి వెళ్ళాడు. చెలికత్తెలు మదిరావతే తిరిగి వచ్చిందనుకుని, పెళ్ళిపాటలు పాడుతూ, మేళతాళాలతో తిరిగి వెళ్ళి పోయారు. వారు వెళ్ళిపోయిన కొంతసేపటికి శశిభూషణుడూ, పురుషవేషంలో ఉన్న మదిరావతీ అడవిమార్గాన బడి తెల్లవార్లూ ప్రయాణంచేసి చివరకు అచలపురమనే ఊరు చేరారు. అక్కడ ఒక బ్రాహ్మణుడు వారికి తన యింట ఆశ్రయమిచ్చాడు. అక్కడే వారు ఒక దేవాలయంలో శాస్త్రోక్తంగా వివాహం చేసుకున్నారు.

ఇక్కడ మదిరావతి వేషంలో ఉన్న సోమదత్తుడు పెళ్ళియింటికి వచ్చేసరికి ధాత్రేయి శంఖహ్రదంనుంచి తిరిగివచ్చింది. తనకు కలిగిన అనుభవాన్ని తన ప్రియ సఖితో చెప్పుకోవటానికి ఆమెకు విశేషం వ్యవధిలేదు. అందుచేత ధాత్రేయి, మదిరావతి రెక్కపట్టుకుని, "సఖీ, నీతో ఒక రహస్యం చెప్పాలి, రా!" అని ఏకాంతంగా



ఒక గదిలోకి తీసుకుపోయింది. ఈలోపలే మేలిముసుగులోనుంచి ధాత్రేయిని చూచి గుర్తుపట్టిన సోమదత్తుడు, "నేను కల గంటున్నానా? ఏదైనా మాయా? లేక భగవంతుడి అనుగ్రహమా?" అని తనలో తాను ఆశ్చర్యపడసాగాడు.

"సఖీ, నీకు ప్రియుడు కానివాడు భర్త కాబోతున్నాడు. నీబాధ నాకు తెలుసు. కాని ఈ బాధను నీవు భరించలేనప్పుడు నా సంగతి జ్ఞాపకం తెచ్చుకో. ఎందుకంటే నేను అభాగ్యురాలిని. నీలాగే నేనూ ఒక యువకుణ్ణి ప్రేమించాను. కాని అతనెవరో, పేరేమిటో, ఎక్కడ వుంటాడోకూడా నేనెరగను. నీ ప్రియుణ్ణి నీవు మళ్ళీ చూడగలుగుతావు. నాకా ఆశకూడా లేదు," అంటూ ధాత్రేయి తన కథ యావత్తూ చెప్పింది.

ఇదంతా వింటున్న సోమదత్తుడు పరమానంద భరితుడై, ధాత్రేయి మాట్లాడటం పూర్తిచేయగానే మేలిముసుగు తొలగించి తన ముఖం కనబరిచాడు. ధాత్రేయి ఆనందానికీ, ఆశ్చర్యానికీ మేరలేదు. సోమదత్తుడు జరిగినదంతా వివరించి, మదిరావతి శశిభూషణుడితోసహా పారిపోయిందని చెప్పేదాకా ధాత్రేయి తన కళ్ళను తానే నమ్మలేకపోయింది.

"మనం ఇలా కబుర్లు చెప్పుకుంటూ కూచుంటే లాభంలేదు. మనంకూడా వేగిరం వెళ్ళిపోకపోతే గుట్టు బయటపడుతుంది. మనం పారిపోయే ఉపాయం ఆలోచించు!" అన్నాడు సోమదత్తుడు.

ధాత్రేయి తన నగలన్నీ మూట గట్టుకుని, సోమదత్తుణ్ణి వెంటబెట్టుకుని దొడ్డిదారిన బయటికి వచ్చి, చీకటిలో తోటల మధ్యగా, దొడ్లమధ్యగా ఊరి బయటికి తెచ్చింది. అక్కడినుండి వారు బయలుదేరి కొన్నాళ్లు ప్రయాణంచేసి ఒక అగ్రహారం చేరి అక్కడ పెళ్ళాడి నివాసం ఏర్పరుచుకుని సుఖంగా ఉన్నారు.





# పరీక్షలు

ఒకానొక దేశంలో ఒక పేదవాడు ఎలాగూ సంసారం గడపలేక రాజువద్దకు పోయి సహాయం వేడాడు. రాజు పేదవాడి కోరిక విన్నమీదట, "నిన్ను నాలుగు ప్రశ్నలడుగుతున్నాను. అన్నిటికన్న వేగమైన దేది? అన్నిటికన్న బలం కల దేది? అన్నిటికన్న మెత్తనైన దేది? అన్నిటికన్న ఆనందకరమైనదేది? రేపటిలోగా ఈ ప్రశ్నలకు సమాధానం చెబితే నీకు సహాయంచేయటానికి ప్రయత్నిస్తాను," అన్నాడు.

పేదవాడు ఈ ప్రశ్నలను మననంచేసుకుంటూ ఇంటికి వెళ్లి సమాధానాలు తట్టక తికమక పడసాగాడు. అతని కూతురు పదిహేడేళ్ళ పిల్ల తండ్రినిచూసి, "ఏమిటి, నాన్నా, దీర్ఘంగా ఆలోచిస్తున్నావు?" అని అడిగింది.

"రాజుగారిని యాచించ బోయాను. ఆయన నన్ను నాలుగు ప్రశ్నలడిగి రేపటిలోగా సమాధానాలు చెప్పాలన్నారు. అటువంటి ప్రశ్నలకు నేనేం సమాధానాలు చెప్పగలను?" అన్నాడు పేదవాడు.

అతని కూతురు ప్రశ్నలు విని, "దీనికింత ఆలోచన దేనికి, నాన్నా? అన్నిటికన్న వేగమైనది గాలి. అన్నిటికన్న బలమైనది భూమి; ఎందుకంటే ఎంత బలంగల ప్రాణులకుకూడా భూమే బలమిస్తుంది. అన్నిటికన్న మెత్తనైనది చెయ్యి; హంసతూలికాతల్పంమీద పడుకున్నవాడు కూడా చెయ్యి ముడిచి తలకింద పెట్టుకుంటాడు. అన్నిటికన్న ఆనందకరమైనది నిద్ర; ఇంక దేనిచేతా పోని దుఃఖంకూడా నిద్రలో పోతుంది," అన్నది.

పేదవాడు ఈ సమాధానాలకు సంతోషించి మర్నాడు ఉదయమే రాజువద్దకు వెళ్ళి సమాధానాలు నాలుగూ చెప్పాడు. "ఈ సమాధానాలు నీ అంతట నీవే

టి. రామేశం



తెలుసుకున్నావా? లేక ఎవరైనా నీకు చెప్పారా?" అని రాజు అడిగాడు.

"నా కూతురు పదిహేడేళ్ళ పిల్ల చెప్పింది," అన్నాడు పేదవాడు.

రాజు ఆశ్చర్యపడి, "నీ కూతురు అంత తెలివిగలదా? అయితే ఈ పోగు తీసుకు పోయి నీ కూతురి కిచ్చి రేపటిలోగా దీనితో నాకొక జరీఉత్తరీయం నేసిపెట్టమను," అని జానెడు పోగొకటి పేదవాడికిచ్చాడు.

పేదవాడు హతాశుడై ఇంటికి తిరిగి వచ్చాడు. తండ్రిని చూసి కూతురు, "ఏం, నాన్నా? రాజుగారికి నీమీద ఇంకా దయ కలగలేదా?" అన్నది.



"ఆయన ఇంకోపరీక్ష పెట్టాడు. ఈ నూలు పోగుతో రేపటిలోగా నీ వాయనకు జరీ ఉత్తరీయం నేసి ఇవ్వాలట!" అన్నాడు తండ్రి.

"అదెంత భాగ్యం, నాన్నా? నువ్వొక చీపురుపుల్ల పట్టుకెళ్ళి రాజుగారి కియ్యి. దానితో మగ్గం తయారుచేసి ఈ సాయంత్రం లోగా ఇవ్వమను. జరీఉత్తరీయం అలాగే నేసిపెడతాను," అన్నది పేదవాడి కూతురు.

పేదవాడు చీపురుపుల్ల ఒకటి తీసుకుని రాజుగారివద్దకు పోయి కూతురు చెప్పిన మాటలే అన్నాడు.

రాజు క్షణం ఆలోచించి, "ఏమో అనుకున్నాను, నీ కూతురు చాలా ప్రయోజకురాలే. నూరు కోడిగుడ్లిప్పిస్తాను. వాటిని పొదగబెట్టి రేపు ఉదయానికల్లా పిల్లలు చేయించి నావద్దకు పంపమని నీకూతురుకు చెప్పు," అన్నాడు.

ఇదంతా ఏదో ప్రమాదానికే వచ్చిందని భయపడుతూ పేదవాడు నూరు కోడిగడ్లూ తీసుకుని ఇంటికి తిరిగి వచ్చాడు. అతని కూతురుమాత్రం నిశ్చింతగా ఆ గుడ్లతో అట్లూ, కూరా, పులుసూ వగైరాలు చేసి, మూడుపూటలా తండ్రికి పెట్టి తానుకూడా తిన్నది. మర్నాడు ఆమె తండ్రితో ఈ విధంగా అన్నది:

"నాన్నా, రాజుగారి వద్దకు పోయి, గుడ్లన్నీ పొదిగాయని చెప్పు. అయితే కోడి పిల్లలు ఏ ఆహారమూ ముట్టటంలేదనీ, ఒక్కరోజు వ్యవసాయంతో పండిన ధాన్యం తప్ప అవి తినేటట్టులేవనీ, అలాటి ధాన్యం ఉంటే ఇప్పించమనీ అడుగు. లేకపోతే కోడిపిల్లలన్నీ చచ్చిపోతాయని చెప్పు."

పేదవాడు ఈమాటలే రాజుకు చెప్పాడు. రాజు చాలా సంతోషపడ్డాడు. ఆయన పేదవాడితో, "నీవింటికి వెళ్లి, నేను రెండు గడియలలో మీ యింటికి వస్తున్నానని నీ కుమార్తెతో చెప్పు," అన్నాడు.

ఈ సంగతి తెలియగానే పేదవాడి కూతురు ఇల్లంతా అలికి ముగ్గులుపెట్టి, గడపలకు పసుపు రాచి, మండిగానికి పచ్చ తోరణం కట్టింది. కాస్సేపట్లో రాజుగారు గుర్రంమీద వచ్చి పేదవాడి ఇంటిముందు గుర్రం ఆపాడు గాని దిగలేదు. రాజుగారిని ఆహ్వానించటానికి రాబోతున్న పేదవాడి కుమార్తెకూడా వాకిలి గుమ్మం దాటబోతూ ఒక కాలుమాత్రం బయటవేసి ఆగి పోయింది.

గుర్రంమీదవున్న రాజు అపిల్లకేసి చూసి, "అమ్మాయీ, నేను దిగి మీ యింట్లోకి రాబోతున్నానా? గుర్రాన్ని నడుపుకుని ముందుకు సాగబోతున్నానా?" అని అడిగాడు.

పేదవాడి కూతురు చిరునవ్వు నవ్వి, "మహాప్రభూ! మీరు నాకన్న గొప్పవారు, తెలివిగలవారు, చదువుకున్నవారు. నేను లోపలికి వెళ్ళబోతున్నానో బయటికి రాబో తున్నానో మీరు చెప్పగలిగితే మీ ప్రశ్నకు నేను సమాధానం చెబుతాను!" అన్నది.

రాజు సంతోషించాడు. గుర్రం దిగి లోపలికి వచ్చి పెద్ద వరహాలసంచీ పేదవాడి కిచ్చాడు. తరవాత ఆయన ఆ పేదవాడి కుమార్తెనే పెళ్లాడి ఆమెను తన పట్టపు రాణిని చేసుకున్నాడు.



# సూర్యుడు

చీకటిరాత్రి ఆకాశంకేసి టెలిస్కోప్‌లోనుంచి చూసినట్టయితే మనకు నక్షత్రాలుమాత్రమే గాక అక్కడక్కడా మబ్బులలాటివి కనిపిస్తాయి. ఇవి మామూలు మబ్బులు కావు; అనేక శతాబ్దాలపాటు వీటి ఆకారం మారకుండా అలాగే ఉంటుంది. అయితే నిజానికి అవి మారుతూనే ఉన్నాయి. కొన్నికోట్ల శతాబ్దాలకాలంలో అలాటి మబ్బు ఘనీభవించి ఒక నక్షత్రం అవుతుంది. మన సూర్యుడు అలా మబ్బునుంచి పుట్టినదే.

* చిత్రమేమంటే మబ్బుగా ఉన్న దశలో ఈ నక్షత్రంలో అతి పలుచనైన వాయువులు—హైడ్రొజెన్, హీలియం అనేవి—తప్ప మరేమీ ఉండదు. ఆ వాయువులుకూడా మనచుట్టూ ఉండే గాలికన్న చాలారెట్లు పలుచగా, తేలికగా ఉంటాయి. వేడికూడా అసలుండదు. కాని ఈ మబ్బుప్రమాణం మనం ఊహించలేనంత హెచ్చుగా ఉంటుంది. అలాటి మబ్బులో మన భూమిలాంటి గోళం పెట్టినట్టయితే అది మహాసముద్రంలో నల్లపూస ప్రమాణంలో ఉంటుంది.

* అంత గొప్పప్రమాణంలో ఉండే మబ్బు క్రమంగా చిన్నది కాసాగుతుంది. అది చిన్నదవుతున్నకొద్దీ అందులోనుంచి అంతులేని వేడి పుట్టుకొస్తుంది. భ్రమణంకూడా ఏర్పడుతుంది. అతి తేలికైన హైడ్రొజెన్, హీలియం అణువులు ఆ వేడికి సంయోగంపొంది భారమైన ఇతర ధాతువుల అణువులుగా తయారవుతాయి. అతి భారమైన ధాతువులు ద్రవరూపం పొందుతాయి. తేలికైనవి వాయురూపంలోనే ఉండి వేడికి ప్రజ్వలిస్తాయి.

* ఒక్క మబ్బులోనుంచి ఒక్క నక్షత్రమే గాక ఇంకా గ్రహాలు పుట్టవచ్చు. ద్రవరూపంలో నక్షత్రం గోళాకృతి పొందినాక, నక్షత్రగర్భంలోనుంచి కొన్ని ధాతువులు పైకివచ్చి తెట్టె కట్టి ఘనీభవించసాగుతాయి.

* అప్పటికీ నక్షత్ర గర్భంలోనుంచి ద్రవం పైకి చిమ్మి నక్షత్రం పైభాగాన్ని ఛేదించవచ్చు. ఇలా ఛేదించుకువచ్చిన పదార్థం తిరిగి నక్షత్రాన్ని చేరనిపక్షంలో ఉపగ్రహంగా ఏర్పడి గ్రహంగా తయారుకావచ్చు.

* సూర్యుడు ఇలా ఒక మబ్బునుంచి ఏర్పడిన నక్షత్రమే. భూమీ, ఇతర గ్రహాలూ ఆ మబ్బులోనుంచి విడివిడిగా తయారై ఉండవచ్చు, లేదా సూర్యుడిలోనుంచి పుట్టినవై ఉండవచ్చు.

* గాలికన్న పలుచనైన వాయుమేఘాలనుంచి సూర్యుడులాటి దేదీప్యమానమైన నక్షత్రాలూ, భూమిలాంటి గ్రహాలూ, వాటితోబాటు అనేక ధాతువులూ, వాటివల్ల ఏర్పడిన బహువిధ పదార్థాలూ, వాటినుంచి ఏర్పడిన సమస్త చరాచర జీవకోటీ తలుచుకుంటే ఇదంతా నిజంగా ఈశ్వరమాయే అనిపిస్తుంది కాదూ!

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1955 మే సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.

★ మార్చి 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

## మార్చి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: జంట విడిచి ఉండము | రెండవ ఫోటో: అమ్మ విడిచి ఆడము

పంపినవారు: మాస్టర్ రమేష్,

C/o ఆర్. జె. ధనకోటి, పోస్టు అంబం (నిజామాబాద్)

బహుమతిమొత్తం రు. 10/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది

# మాయాచక్రం (అట్టచివరి బొమ్మ) - 5

అప్పుడు ఆ రెక్కల గుర్రం రాణిపైన జాలిపడి, మానవభాషలో "రాణీ!— ఈపాటి దానికే అంత ప్రాధేయమెందుకు? ఎర్రకోటకు తీసుకువెళతాలే, దిగులు పడకు" అంటూ ధైర్యంచెప్పింది.

మరునాటి ఉదయంవరకూ అది విశ్రాంతితీసుకొన్నతరువాత రాణిని తన వీపుమీద ఎక్కించుకొని ఆకాశమార్గాన దౌడుతీయ నారంభించింది. అంత ఎత్తున అతివేగంగా పోతూవుంటే, రాణికి అనేకమైన ప్రపంచపు వింతలు కంటబడసాగినై.

అయితే, ఆ చిత్రాలను చూచి మనసులో ఆనందించగల స్థితిలో లేదు, రాణి. ఇప్పు డెంతసేపూ ఆమె దృష్టి ఎలా ఎర్రకోట చేరుకోవడం, ఎంతట చేరుకోవడం, చేరుకొని తన భర్తను ఎలా దర్శించడం?—అనే విషయాలపైనే ఉండిగాని, మరే విషయానికీ చోటులేదు.

ఇటువంటి ఆత్రంతో పోతున్న రాణి ఒక్కసారి కిందికిచూడగానే, మాసిన గుడ్డలు కట్టుకొనివున్న ఒక పేదరాలు కనిపించింది. వెంటనే రాణికి మెరపు వంటి ఒక ఆలోచన స్ఫురించి, గుర్రంతో ఇలా అన్నది:

"ఓ అశ్వరాజా!—నా భర్త ఇచ్చిన విలువైన దుస్తులతో నే నిప్పుడు ముస్తాబైవున్నాను. నేను ఫలానా అని ఎవరైనా సులువుగా గుర్తించగల్గుతారు. ఐతే, ఈ స్థితిలో నన్ను ఎవరూ తెలుసుకోకుండా ఉండడమే అన్నివిధాలా నాకు మేలు. కనుక, నా వస్త్రాలు అదుగో, ఆ పేదరాలికిచ్చి, ఆమె గుడ్డలను నేను ధరిస్తాను" అని చెప్పింది.

రెక్కలగుర్రం రాణి ఉద్దేశాన్ని ఆమోదించి, వెంటనే భూలోకానికి దిగింది. అప్పుడు రాణి తన అమూల్య వస్త్రాభరణాలన్నీ ఆ పేదరాలికిచ్చి, ఆమె కట్టిన బట్టలనూ, నల్లపూసలూ మొదలైన పేదవాళ్ల ఆభరణాలనూ తను పుచ్చుకొని ధరించింది.

ఈ మారువేషంతో రాణి మళ్ళీ గుర్రం ఎక్కి, రోజల్లా ప్రయాణంచేయగా అల్లంతలో ఎర్రటి తంగేడువనం, ఆ వనంలో ఆకర్షణీయమైన ఎర్రకోట స్పష్టంగా కనిపించినై. అప్పుడు గుర్రం 'మనం రావలసిన చోటికి వచ్చేశాం!' అని రాణికి చెప్పింది. రాణి చాలా సంతోషించింది. తరువాత...

# చిత్రకథ



వాసూ, దాసూ ఒక రోజున పొలంలోకి వెళ్ళారు. దోసకాయలు కోసి, సంచీ నిండా ఎక్కించారు. 'ఇన్ని కాయలు మోయలేవురా, కొన్ని తీసెయ్యి' అన్నాడు వాసు. 'పోవోయి, పిరికీ! ఇంకో ఇన్నయినా నాకు లెక్కలేదు' అని ప్రగల్భాలు కొట్టాడు గడుగ్గాయి దాసు. అంతటితో ఆగలేదు. పెద్దకబుర్లు చెప్పసాగాడు.




'ఒరే వాసూ!–నేను ముక్కుమీద దోసకాయ నిలబెట్టి, ఆ కాలవ దాటుతాను, నా సామర్థ్యం చూస్తా! పందెం కాయ్!' అన్నాడు. అంటూ, ఒకేఒక అడుగు వేశాడు. రెండో అడుగు వెయ్యబోయేసరికల్లా కాలవలో—వాడొక మూల, కాయొక మూల! 'బడాయికోరుల కింతే శాస్తి!' అని నవ్వాడు వాసు.



# వార్తలు-విశేషాలు

మన దేశంలోని విశ్వవిద్యాలయాల అభివృద్ధికి వచ్చే సంవత్సరం 5 కోట్ల రూపాయలు ఖర్చు పెట్టడానికి యూనివర్సిటీ గ్రాంట్స్ కమిషన్ నిశ్చయించింది.

*    *    *    *

బొంబాయి హైకోర్టు న్యాయమూర్తీ, ప్రెస్ కమిషన్ అధ్యక్షులు అయిన శ్రీ జి. ఎస్. రాజాధ్యక్ష గుండెజబ్బుపల్ల ఫిబ్రవరి 9వ తేదీన బొంబాయిలో కాలధర్మం చెందారు.

*    *    *    *

ఇండియాలో ఒక ఉక్కు కర్మాగారాన్ని నిర్మించేందుకు రష్యా – ఇండియా ప్రభుత్వాల మధ్య ఒడంబడిక జరిగింది.

*    *    *    *

ఉత్తరప్రదేశ్ ప్రభుత్వం గోసంవర్ధన విచారణసంఘంవారి సూచనల నంగీకరించి, రాష్ట్రం మొత్తంలో గోవధను నిషేధించాలని నిశ్చయించింది.

*    *    *    *

తిరువాన్కూర్ - కొచ్చిన్ రాష్ట్రంలో శ్రీ థానుపిళ్ళె మంత్రివర్గంపై విశ్వాసరాహిత్య తీర్మానం ఆమోదించబడింది. కాంగ్రెస్ అసెంబ్లీ పార్టీ నాయకుడైన శ్రీ పి. గోవిందమీనన్ నూతన మంత్రివర్గాన్ని ఏర్పరిచారు.

*    *    *    *

రష్యా ప్రధానమంత్రి జార్జి మలెంకోవ్ రాజీనామా యిచ్చాడు. అయన స్థానంలో మార్షల్ బుల్గానిన్ ప్రధానమంత్రిగా నియమించబడ్డాడు.



ఆంధ్రరాష్ట్ర అసెంబ్లీ సభ్యుల ఎన్నికలు ఫిబ్రవరి **11** వ తేదీన ప్రారంభమయినై. ఆరోజున మొత్తం **43** స్థానాలకు పోలింగు జరిగింది. అయిదు దఫాలుగా యీ ఎన్నికలు జరిగి ఫిబ్రవరి **27** వ తేదీతో ముగింపు కాగలవు.

*     *     *     *

విశాఖపట్టణంలోని హిందూస్తాన్ షిప్‌యార్డ్‌లో తయారవుతున్న తొలి ప్రయాణీకుల ఓడను జూన్‌మాసంలో జలప్రవేశం చేయించగలరు. దీని బరువు **6,000** టన్నులు. ఈ ఓడ **620** మంది ప్రయాణీకులనూ, **4,000** టన్నుల సరుకునూ మోయగలదు.

*     *     *     *

మన దేశంలోకల్లా గొప్ప గ్రంథాలయం కలకత్తాలోని 'నేషనల్ లైబ్రరీ'. ఇందులో ఇప్పుడు ఇంగ్లీషు, రాష్ట్రభాషల—గ్రంథాల సంఖ్య **756,500**కు దాటింది.

*     *     *     *

ఇండియాలో పర్యటిస్తూన్న రష్యన్ రచయితల ప్రతినిధివర్గంవారు మద్రాసు వచ్చారు. ఫిబ్రవరి **14** వ తేదీన వారు చందమామ కార్యాలయాన్ని సందర్శించారు. ఆ సందర్భంలో ఏడు భాషలలోను 'చందమామ' ప్రతులతో కూడిన ఒక్కొక్క సెట్టు ప్రతినిధివర్గంలోని ప్రతిఒక్కరికీ బహూకరించబడింది. వారు వాహినీ స్టూడియోనుకూడా సందర్శించి అక్కడి వివిధ శాఖలకు సంబంధించిన విషయాలను తెలుసుకున్నారు.

*     *     *     *

అండమాన్, నికోబార్ ద్వీపాలకు, పిల్లలు పొగ త్రాగకుండా నిషేధిస్తున్న చట్టాన్ని అనువర్తింపజేస్తూ ఇండియా ప్రెసిడెంట్ ఒక ఉత్తరువు జారీచేశారు.

*     *     *     *

రాయ్‌పూర్‌జిల్లా సిర్పూర్‌లో **1,200** సంవత్సరాలనాటి బౌద్ధ స్తూపారామ శిథిలాలను కనుగొన్నారు. అక్కడ సాగర్ విశ్వవిద్యాలయ పురాతత్వ శాఖవారికి దీపాలు, పళ్ళేలు, కొడవళ్ళు మొదలైన **2,000** గృహోపకరణ సామగ్రి దొరికింది. ఆరడుగుల ఎత్తుగల బుద్ధ విగ్రహం, **16** స్తంభాల సభామండపంకూడా కనుగొనబడింది.



విశాలాంధ్ర నంతనీ
హాస్యంలో ముంచెత్తుచున్న
అద్భుత శృంగార చిత్రం!



విజయా వారి

# మిస్సమ్మ

డైరెక్షన్....... ప్రసాద్

నిర్మాతలు.... నాగిరెడ్డి & చక్రపాణి



Printed by B. NAGI REDDI at the B. N. K. Press Ltd., Madras 26, and Published by him for Chandamama Publications, Madras 26. Controlling Editor: SRI 'CHAKRAPANI'

Photo by P. K. Patel



బహుమతి
పొందిన వ్యాఖ్య

అమ్మ విడిచి ఆడము

పంపినవారు :
రమేష్ - అంబం

